ఏప్రిల్ 2019

ఉగాది పండుగ శుభాకాంక్షలతో!



# కొత్తపల్లి

తెలుగు పిల్లల ఈ మాసపత్రిక వెల రూ.30/-




సంపుటి: 5 సంచిక: 2 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. ఏప్రియల్ 2019



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670, 9490180695

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** జి.వి. నారాయణ శర్మ

**ప్రచురణ:**
కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**
సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**వెబ్సైటు నిర్వహణ:**
ఆనంద్, లక్ష్మి

**చిత్రాలు:**
**అడవి రాముడు : 9491870753**
రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వాణిజ్యం, మార్కెటింగు:**
బి. అశోక్: 9963571510




# విషయ సూచిక





ముఖచిత్రం: రంగులు

చిత్రకారుడు: మోషే డయాన్

కొత్తపల్లి 104 వ పుస్తకం!




---

వరం తుంగా చ్ఛృంగా ద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వా యం కాయః కఠినదృషదంతే విదళితః ।
వరం న్యస్తో హస్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే
వరం వహ్నౌ పాతస్త దపి న కృతః శీలవిలయః ।

సంస్కృత మూలం
(భర్తృహరి)

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

ఉరుతర బర్వతాగ్రముననుండి దృఢంబగు రాతిమీద స
త్వరముగ ద్రెళ్ళి కాయము హతంబుగ జేయుటమేలు, గాలి మే
పరి దొర వాత కేలిడుట బాగు, హుతాశన మధ్య పాతమున్
వరమగు, చారు శీలగుణ వర్జనమర్హముగాదు చూడగన్

భావం: నిజంగా చూస్తే, ఏదైనా పెద్ద పర్వతం మీది నుండి దృఢమైన రాతి మీదికి దూకి చచ్చిపోవటం కూడా మేలే; లేకపోతే పాము నోట్లో చెయ్యి పెట్టటం కూడా సరైనదే; లేదా ఏ మంటల మధ్యలోనో పడి కాలిపోతే కూడా మంచిదే- కానీ మంచి గుణాలను మాత్రం ఎట్టిపరిస్థితుల్లోనూ వదలకూడదు.




# రంగులు

చిన్నోడు బాగా 'చూస్తాడు'.

ఇప్పుడే కాదు. మొదటి నుండే వాడికి చూడటం బాగా వచ్చేది.

పుట్టాక, మొదటి సారి వాళ్ల అమ్మని చూశాడు కదా, అప్పుడే వాడు ఆమె కనుపాపల రంగు చూసేడు. ఆమె పెట్టుకున్న బొట్టు రంగు చూశాడు. రెండూ ఒకటి కాదని ఆశ్చర్య పోయాడు. అయితే ఇవేవీ వాడికి గుర్తు లేవిప్పుడు.

మొదట్లో చీరల్నే ఉయ్యాలగా వేసి పడుకో బేట్టేది వాళ్ళమ్మ. ఇంట్లో ప్యాన్ హుక్కుకో, బయట చెట్టు కొమ్మకో చీరలు వ్రేల్లాడదీసి, అందులో వీడిని పడుకో బెట్టి తన పనులు తను చేసుకునేది. అవే నాలుగైదు రంగులు - తెలుపు, పసుపు, ఆకుపచ్చ, నీలం, వంకాయరంగు వీటినే మళ్లీ మళ్లీ చూస్తూ వచ్చాడు వీడు. ఆ సమయంలోనే ఉయ్యాల సందుల్లోంచి బయటి ప్రపంచం కనబడ్డది. గాలికి ఊగుతున్న చెట్ల ఆకులు, నిశ్చలంగా ఉన్న ఆకాశపు నీలం.

అప్పుడే వాడికి అర్థమైంది- 'రంగులకి అంతం ఉండదు - ఎన్ని రంగుల్ని చూడ గల్గితే అన్ని కనిపిస్తాయి' అని.

ఎండా కాలంలో వాళ్లు ఆరుబయట మంచాలు వేసుకొని పడుకునే వాళ్లు. అప్పటికి వాడికి చాలానే రంగులు తెలిసాయి. **'అన్నిటికీ పేర్లు పెట్టలేం'** అని కూడా అర్థమైంది. ఎలాగంటే అమ్మ వాడికి రంగుల పేర్లు మళ్లీ మళ్లీ చెప్పి పలికించేది. ఒక **ముదురు ఆకుని**, ఒక లేత ఆకుని తెచ్చి 'ఇదేం రంగు?' అంటే రెండిటినీ **'ఆకుపచ్చ'** అనేదామె. వీడు నవ్వేవాడు: 'వేర్వేరు రంగులు - ఒకటే పేరట, బలే పెడుతుందే!' అని.

అప్పుడే వాడికి ఆకాశం రంగులు మారుస్తుందని కూడా తెలిసింది. ఉదయంలోను, సాయంత్రాల్లోను అది **పండు నారింజ** రంగులో ఎర్రగా ఉంటుంది. వాన పడేప్పుడు మబ్బుల నల్ల రంగు పైన ఉంటే, **ఆకాశపు నీలం** దాని వెనక దాక్కుంటుంది. అయితే రాత్రి పూట చీకట్లో మటుకు ఆకాశం అంతా **నల్లగా** ఉంటుంది.

రాను రాను వాడు పిట్టల్ని చూశాడు. కాకి, కోయిల **నలుపే**. చమురు కాకి ఉంటుంది. అది **గోధుమ, ఎరుపు కలిసి పోయిన రంగు**. పిచ్చుకలది **గోధుమ రంగు**- కానీ అన్నీ రంగులు మారుస్తూనే ఉంటాయి ఎప్పుడూ. ఒకే పిట్ట, వేరు వేరు కాలాల్లో వేర్వేరు రంగులు అద్దుకుంటుంది.

వాన పడగానే ఓసారి అమ్మ పిల్చి, ఎత్తుకొని చూపించింది - ఇంద్రధనస్సును! 

ఆ మూల నుండి ఈ మూలకి, ఆకాశం నిండా పరచుకొని ఉంది! దాని నిండా ఎన్ని రంగులో! ప్రపంచంలో ఉన్న అన్ని రంగులూ అందులో కనిపించాయి చిన్నోడికి. తుంపర్లలోంచి బయటి కొచ్చేస్తే మటుకు ఇంద్రధనస్సు మాయం అయిపోతుంది ఎందుకనో?!

చిన్నోడి వేలుకి ముల్లు గుచ్చుకొని, బొట్లు బొట్లు రక్తం కారిందొకసారి. నొప్పి పుట్టి

ఏడ్చాడుగాని, **రక్తపు ఎరుపుని** చూసి ఆశ్చర్య పోయాడు కూడా. అయితే ఆ తర్వాత కొన్ని రోజుల వరకూ వాడికి ఎరుపంటే భయంవేసింది: మళ్లీ నచ్చిందనుకోండి, అదెట్లాగంటే, వాళ్ళకి ఎర్రటి లేగదూడ ఒకటి ఉండేది. రోజూ సాయంత్రం సూర్యుడు దిగి పోతున్నప్పుడు, అది పరుగెత్తుకొని వస్తుంటే లేచే ఎర్రటి దుమ్ముకి, అంత పైనున్న సూర్యుడు కూడా అస్సలు ఏమాత్రం కనబడకుండా పోయేవాడు. అది చూసీ చూసీ చిన్నోడికి ఎరుపంటే భయం కూడా పోయింది.

పెద్దయ్యాక, చిన్నోడు వేసే బొమ్మల్లో రంగుల్ని చూసి, అందరూ ఆశ్చర్య పోయేవాళ్లు.

"ఏముంది, చుట్టూ ఉన్నవేగా ఇవి?" అనేవాడు చిన్నోడు. "చూసే కళ్లుంటే అన్నీ కనిపిస్తాయి" అని నవ్వేవాడు.

"ఇన్ని రంగులు వేస్తావు కదా, నీకు ఏరంగు ఇష్టం?" అడిగాడొక పిల్లాడు చిన్నోడిని.

చిన్నోడు తన చుట్టూతా చూపించాడు- చుట్టూతా పిల్లలు: అందరూ రంగు రంగుల చొక్కాలు వేసుకొని ఉన్నారు- "అందరూ కలిసి ఆడుకుంటూ బలే ఉన్నారు కదా, రంగులు రంగులుగా?!" అన్నాడు. "వీళ్లలో ఏ ఒక్క రంగు బాగుంది అంటే నువ్వు మాత్రం ఏం చెబుతావు? అన్నీ ఉంటే బాగుంటుంది గాని?!" అన్నాడు. అర్థమై నిండుగా నవ్వాడా పిల్లాడు. నిజంగానే మన చుట్టూ ఎన్నెన్ని రంగులు, ఎంత భిన్నత్వం! దేనికది అందమే, అన్నీ కలిస్తే ఇంకా మరీ అందం!

**రకరకాల రంగుల్ని** ఇష్టపడే మీకందరికీ వేసవి సెలవల శుభాకాంక్షలు!

కొత్తపల్లి బృందం.

చదువులో ఆనందమే జీవితంలో ఔన్నత్యానికి సోపానం అవుతుంది. *-గాంధీ*

# ఆదర్శం

బిట్టు కథలు

*జరిగిన కథ : బిట్టు ఢిల్లీ కుర్రాడు. వాళ్ళ అమ్మమ్మ వాళ్ల ఊరు పోరంకికి వచ్చాడు, వేసవి సెలవలు గడిపి వెళ్ళేందుకు. ఇక్కడ వాడు రకరకాల సంగతులు నేర్చుకుంటున్నాడు. మొన్న పిచ్చుకలు దొరికాయి వాడికి. అంతకుముందు ఓ కుక్క దొరికింది. దానికి రెయిన్ బో అని పేరు పెట్టుకున్నాడు. పక్కింటి అమ్మమ్మ పేరు జయమ్మమ్మ. ఆవిడే, పిచ్చుకల్ని బయట పడేసింది.. ఇక చదవండి.*

*రచన: శ్రీమతి అనురాధ నాదెళ్ళ, పోరంకి, కృష్ణాజిల్లా.*

మర్నాడు జయమ్మమ్మ వచ్చింది- రమ్యనీ, రాహుల్ ని తీసుకుని. ఆవిడ వచ్చేసరికి బిట్టు పిచుకల దగ్గర ఉన్నాడు. 'నేను బయట పడేసిన పిచుకల్ని నువ్వు ఇంట్లోకి తెచ్చుకున్నావా?' అని జయమ్మమ్మ తిడుతుందేమో అనుకొని కొంచెం చిన్నబోయాడు బిట్టు.

'ఏమిటి, ఆ పిచుకల్ని ఇక్కడ తెచ్చిపెట్టావా?' అంది ఆమె కొంచెం ఆశ్చర్య పోతున్నట్లు. బిట్టు అమ్మమ్మ వైపు చూసాడు. 'అవును జయా, వీడు ఎప్పుడూ పిచుకల్ని చూడలేదుట. వీడు ఉన్నన్నాళ్లూ వీటిని పెంచుకుంటాడట' అంటూ నవ్వింది అమ్మమ్మ, వాతావరణాన్ని తేలిక చేస్తూ.

బిట్టూ రమ్యని, రాహుల్ని దగ్గరికి పిలిచి పిచుక పిల్లల్ని చూపించాడు. వాళ్ల వెనకే ఇల్లంతా తిరుగుతున్నాడు రెయిన్బోగాడు. జయమ్మమ్మ కొంచెం విసుక్కుంది: 'ఈ పిచ్చి కుక్క ఎక్కడిది? పెంచుకోవాలంటే మంచి జాతి కుక్కని తెచ్చి పెట్టుకోవాల్సింది' అని.

బిట్టుకి జయమ్మమ్మ మాటలు నచ్చలేదు. కానీ తాతయ్య చెప్పారు కదా, పెద్దవాళ్ల మాటలకి కోపం తెచ్చుకోకూడదని?! అందుకని 'ఎలాగైనా సరే, రెయిన్బోగాడు జయమ్మమ్మకి కూడా నచ్చేలా చెయ్యాలి' అనుకొని 'ఇది చాలా మంచిది అమ్మమ్మా, దావీదు దగ్గర నుంచి తెచ్చాను' అని మాత్రం

అన్నాడు.

సాయంకాలం అవుతూనే దావీదు, చిట్టి చదువుకునేందుకు వచ్చారు. 'జయమ్మమ్మ రెయిన్బో గాణ్ణి విసుక్కుంది' అని దావీదుతో చెప్పేసాడు బిట్టు.

'ఫర్వాలేదులే, వాడి బిహేవర్ చూస్తే జయమ్మమ్మ కూడా వాణ్ణి ఇష్టపడుతుంది' అని దావీదు బిట్టుకి ధైర్యం చెప్పాడు.

ఇంగ్లీషు మాటలు ఉపయోగించటం అంటే దావీదుకు సరదాగా ఉందని బిట్టు అర్థం చేసుకున్నాడు. 'కానీ దావీద్, బిహేవర్ కాదు బిహేవియర్ అనాలి' అని సరిచేసాడు. ఆ పదాన్ని పదే పదే దావీదు తనలో తాను అనుకున్నాడు గుర్తు పెట్టుకుందుకు- 'నేర్చుకునేప్పుడు ఒకటికి రెండు సార్లు తలుచుకోవాలి' అని తాతయ్య చెప్పారు కదా.

తాతయ్య ఆఫీసు నుంచి వచ్చి వీళ్లందర్నీ చదివించటం చూసి జయమ్మమ్మ రమ్యనీ, రాహుల్ని కూడా చదువుకుందుకు పంపింది. వాళ్లు కొంచెం బిడియంగా ఉన్నారు. ఎక్కువగా ఏమీ మాట్లాడటం లేదు. 'క్రొత్త కదా' అనుకున్నారు అందరూ.




'ఇద్దరికీ తెలుగు రాదు' అని చెప్పేసరికి, "అయ్యో! నేను నేర్పిస్తానులెండి తెలుగు" అన్నారు తాతయ్య.

కానీ వాళ్లిద్దరూ అయిష్టంగా ముఖాలు పెట్టారు. జయమ్మమ్మ కూడా 'తెలుగు ఎందుకు, వాళ్లిద్దరూ ఇంగ్లీషు మీడియమే. హిందీ, సంస్కృతం కూడా నేర్చుకుంటు-న్నారు. తెలుగు అవసరం లేదు' అని చెప్పింది.

కానీ తాతయ్య 'అయ్యో, మాతృభాష కొంచెం కూడా రాకపోతే వికారంగా

ఉండదూ? మర్యాద ఏముంటుంది? వాళ్లు తెలుగులో సరిగ్గా మాట్లాడను కూడా మాట్లాడలేక పోతున్నారు చూసారా? చదవటం, రాయటం నేర్చుకుంటే పలుకులో కూడా స్పష్టత వస్తుంది" అని చెప్పాక రమ్య, రాహుల్ కూడా తెలుగు నేర్చుకోవటం మొదలెట్టారు.

ఆ రాత్రి బిట్టు తన పుస్తకంలో ఇలా రాసుకున్నాడో కవిత....

**పచ్చ, తెలుపు, కాషాయం,**
**మూడు రంగులు మన జెండా!**
**తెలుగు, హిందీ, ఇంగ్లీషు**
**మూడు భాషలూ మనకొచ్చు!**

జయమ్మమ్మ పిలిచిందని ఒక రోజు రమ్య వాళ్లింటికి వెళ్లాడు బిట్టు. రమ్య, రాహుల్ అలా మౌనంగా సోఫాలో కూర్చుని టి.వి. చూస్తున్నారు- ఏమీ మాట్లాడనే లేదు! ఏదైనా మాట్లాడబోయినా జయమ్మమ్మ వాళ్లని కోప్పడుతోంది: 'ఎందుకు ఆ పనికి మాలిన కబుర్లు? కాస్సేపు టి.వి. చూడండి!' అంటూ. బిట్టు ఆశ్చర్య పోయాడు. ఎందుకంటే బిట్టు అసలు టి.వి. చూడనే చూడడు! అమ్మమ్మ వాళ్ల ఇంట్లో టి.వి ఎక్కడో ఒక మూలకి ఉంటుంది. దాన్ని ఎవరూ పెద్దగా పట్టించుకోరు. తాతమ్మ మటుకు ఒక్కోసారి భక్తి టి.వి. పెట్టుకుని చూస్తుంది.




జయమ్మమ్మ బిస్కెట్లు తెచ్చి పెట్టింది. పళ్లెం చేతిలో పెడుతూ: 'క్రింద పడకుండా తినండి. పడిందంటే ఇంక మీరే తుడవాలి' అని హెచ్చరిక చేసింది. ఆ తర్వాత బిట్టుకి పెద్దగా తినాలని అనిపించలేదు. కానీ మర్యాదకి ఒకటి తిని 'ఇంక ఇంటికెళ్తా' అంటూ

లేచాడు. అదే అవకాశం కోసం చూస్తున్న రమ్య, రాహుల్ కూడా బిట్టుతో పాటు వాళ్లింటికి బయలుదేరారు.

బిట్టు, రాహుల్ ఇద్దరూ క్రికెట్ గురించి మాట్లాడుతుంటే రమ్య 'బోర్' అంది. అమ్మమ్మ స్వెటర్ అల్లుకుంటూ తాతమ్మతో ఏవో కబుర్లు చెబుతుంటే అక్కడకి వెళ్లింది. అంతలో తాతమ్మ రమ్యతో కబుర్లు మొదలెట్టింది. ఆవిడకి సరిగ్గా వినపడదు కదా, దాంతో ఒక్కో ప్రశ్ననీ రెండు సార్లు అడగటంతో ఆమెకేసి విచిత్రంగా చూసింది రమ్య.

కొంచెంసేపు ఆవిడని మాట్లాడనిచ్చాక, ఇంక అమ్మమ్మ లేచి, "పిల్లలకి నేను కథ చెబుతాను" అంటూ తన దగ్గర కూర్చోబెట్టుకుంది. ఇక ఆ కథల్లోను, ఆటల్లోను మునిగి సాయంకాలం ఎప్పుడైందో కూడా గమనించలేదు పిల్లలు.

రమ్యకి మణి అమ్మమ్మ తెగ నచ్చింది. రాహుల్‌కి బిట్టుతో ముచ్చట్లు నచ్చాయి. 'ఇంట్లో అమ్మ, అమ్మమ్మ వాళ్లకి వాళ్ళు టి.వి. చూస్తూ కూర్చుంటారు. ఊరికే మమ్మల్ని కూడా టివి ముందు కూర్చోబెదతారు. మాతో అసలు మాట్లాడనే మాట్లాడరు! కథలైతే ఎప్పుడూ చెప్పనే లేదు!' అనుకున్నారు రమ్య, రాహుల్.

ఆరోజు జయమ్మమ్మ డాబామీద వడియాలు ఆరబెట్టి, పిల్లల్ని కాపలా ఉంచింది: 'ఉడతలు తిని పాడుచేస్తాయి- జాగ్రత్తగా గమనించు-కోండి' అని పురమాయించింది. రమ్యకి విసుగ్గా ఉంది, ఎండలో డాబా మీదకి, క్రిందకి తిరగటం. అమ్మమ్మకి చెప్పి మర్నాడు వడియాలు వాకిట్లోనే ఎండ బెట్టించింది.

బిట్టు వెనుకే ఆ రెయిన్బో కుక్క ఉంటుంది కదా, అది వడియాలు ముట్టుకొని పాడు-చేస్తుంది. అందుకని బిట్టుని వడియాల వైపుకు రానివ్వకు" అని రాహుల్‌తో చెప్పింది జయమ్మమ్మ. సరేనని బిట్టు, రాహుల్ చెస్ ఆడుతూ దూరంగా, పెరట్లో చెట్టు క్రింద కూర్చున్నారు. రమ్య ఎండకి ఒకటే ఆపసోపాలు పడుతూ ఇల్లంతా తిరుగు-తోంది.

అకస్మాత్తుగా రెయిన్బో అరవటం మొదలెట్టాడు. 'ఆగు! అరవకు! జయమ్మ-మ్మ కోప్పడుతుంది' అని బిట్టు రెయిన్బోని హెచ్చరిస్తున్నాడు కానీ, అది మాత్రం ఆగటం లేదు!



అంతలో జయమ్మమ్మ బయటకు వచ్చి, గోడ మీద ఉన్న రెండు కోతుల్ని చూసి, కర్ర పుచ్చుకుని తరిమేసింది వాటిని! అప్పుడు అర్థమైంది అందరికీ- రెయిన్బో అరిచిన కారణం! వాడు హెచ్చరిక చెయ్యకపోతే కోతులు వడియాల్ని పాడుచేసి ఉండేవి!!

ఆ రోజున జయమ్మమ్మ ఒక కప్పులో పాలు పోసి తెచ్చి, రెయిన్బోగాణ్ణి త్రాగమంది. బిట్టుకి గర్వంగా ఉంది- 'మా రెయిన్బోగాడు ఎంత చురుకైనవాడో, ఎంత మంచివాడో జయమ్మమ్మకి ఇప్పటికైనా తెలిసింది కదా' అనుకున్నాడు.

కోతుల్ని చూడటం కూడా అదే మొదటిసారి బిట్టుకి! ఆ రోజున వాడికి నిజంగా ఏదో క్రొత్త ప్రపంచంలో ఉన్నట్లు ఉంది. 'సాయంకాలం దావీదు వచ్చాక ఈ విషయం చెప్పాలి' అనుకున్నాడు.

కానీ సాయంకాలం దావీదు, చిట్టి చదువుకుందుకు రాలేదు! ఇట్లా అవటం ఇదే మొదటిసారి. అందుకని తాతయ్య ఆఫీసు నుంచి రాగానే అందరూ బయలుదేరారు. సైకెల్ షాపు దగ్గరకెళ్తే అది కట్టేసి ఉంది. అలా నడుచుకుంటూ దావీదు ఇంటికి వెళ్ళారు అందరూ.

దావీదు చేతికి చిన్నకట్టు కట్టుకుని కూర్చుని ఉన్నాడు. వాడి ముఖం మీద, చేతుల మీదా కూడా గీరుకు పోయి, ఎండిపోయిన సన్నని రక్తం చారికలు ఉన్నాయి. కళ్ళు ఉబ్బి ఉన్నాయి. అలా ఎప్పుడూ ఎవరినీ చూడని

బిట్టు నిజంగా జడుసుకున్నాడు- తాతయ్య వెనక్కి వెళ్ళి నిలబడ్డాడు.

వీరబాబు వాకిట్లోకి వచ్చి, 'ఈ రోజు చాలా ప్రమాదం తప్పిపోయింది సారూ, ప్రొద్దున్నే న్యూస్ పేపరు వేసేందుకు వెళ్తున్నాడు పిల్లాడు- వద్దంటే వినడు! 'నేనూ కొంచెం సంపాదించాలి' అంటాడు. ఈ రోజు వీధి మలుపులో ఎవరో స్కూటరాయన వీడి సైకిల్ని గుద్ది వెళ్లిపోయాడు! పిల్లాడు క్రింద పడిపోయాడు; స్కూటరాయన ఆగనైనా ఆగలేదు! రోడ్డుమీద చూసినవాళ్ళే పిల్లాడిని, సైకిల్ని ఇంటివరకూ తీసుకొచ్చారు. వాడు బాగా భయపడిపోయాడు. అయితే నేనే ఈ సంగతులేవీ అమ్మ గారితో చెప్పద్దన్నాను కమలమ్మని!' అన్నాడు తలవంచుకుని.

తాతయ్య దావీదు ప్రక్కన కూర్చుని, 'దావీదూ, నీకు ఏదైనా ప్రమాదం అయితే ఇంక నువ్వు అమ్మకి, నాన్నకి, తమ్ముళ్లకి, చెల్లెళ్లకి ఎలా సాయం చేస్తావురా, చెప్పు?! నీది ఇంకా చిన్న వయసే కదా; సంపాదన పని ఇప్పుడే వద్దు. మీ తాతయ్య, నేను చెప్పిన మాట విను. ఈ పనులు కొంచెం పెద్దయ్యాక చెయ్యచ్చులే' అన్నారు అనునయంగా.



దావీదు తల వంచుకున్నాడు. వాడి కళ్లల్లో నీళ్ళు. బిట్టు, రమ్య, రాహుల్, చిట్టీ దూరంగా నిలబడి చూస్తున్నారు. 'అమ్మమ్మ, తాతయ్య మాకోసం ఎంత కష్టపడుతున్నారో చూస్తున్నా కదా తాతగారూ, నేను సోమరిగా కూర్చోలేను. మేము వచ్చాక అమ్మమ్మకి పని ఎక్కువైంది; తాతయ్య కూడా కొట్లో ఎక్కువ సేపు కూర్చుంటున్నాడు. అందుకని నాకు చేతనైంది నేను చెయ్యాలని అనుకున్నాను' అన్నాడు దిగులుగా.

తాతయ్య వాడిని ప్రేమగా దగ్గరకు తీసుకుని

చెప్పారు, 'అమ్మమ్మ, తాతయ్య ఇద్దరూ ఇంకా కొంచెం ఓపికగానే ఉన్నారు దావీదూ. వాళ్లకి మిమ్మల్ని పెంచటం కొంచెం శ్రమే; కానీ అంత కష్టం ఏమీ కాదు. నిన్ను, చిట్టిని మేమంతా చదివిస్తాం. మీరు బాగా చదువుకోండి- అది చాలు మాకు. పెద్దయ్యాక మీరే మా అందరినీ చూసుకుందురు గాని, ఇప్పటికి నామాట వింటావా మరి?' దావీదు తలూపాడు.

ఇంటికొచ్చే దారిలో కొద్దిసేపు అందరూ మౌనంగా ఉన్నారు. రాహుల్‌కి తాతయ్య బాగా నచ్చారు. 'తాతగారూ, మీరు దావీదుకి ధైర్యం చెప్పి, 'నేను చదివిస్తా; అని చెప్పారు కదా, నాకు ఆ మాట చాలా నచ్చింది. పెద్దయ్యాక నేను కూడా మీలాగానే ఎవరికైనా సహాయం చేస్తాను' అన్నాడు ఎనిమిదో తరగతి రాహుల్. 'నేను కూడా' అన్నారు బిట్టు, రమ్య.

'అందుకే అందరూ బాగా చదువుకోవాలి. అప్పుడే మరొకరికి సహాయం చేసే అవకాశం వస్తుంది. మానాన్నగారు ఇలాంటి మంచి పనులు చాలా చేసేవారు. నాకు ఆయనే ఆదర్శం. అవునూ, ఇంతకీ మీకు 'ఆదర్శం' అంటే తెలుసా?' అని అడిగారు తాతయ్య. అందరూ ముఖాలు చూసుకున్నారు.



'ఆదర్శం అంటే అందరికీ నచ్చే పని!' అన్నాడు రాహుల్ ఆలోచనగా.

"అవును రాహుల్, ఒక మంచిపనిని చూసి, 'మనం కూడా చెయ్యాలి' అనిపిస్తుందే, అదే ఆదర్శం అంటే" అని నవ్వారు తాతయ్య.

'నిజంగానే నా తెలుగు కొంచెం బాగైంది తాతగారూ' అన్నాడు రాహుల్ సంతోషంగా.




# దయ్యం?!

*మనిషి ఊహలే మనిషికి బలాలు, అవే మనిషికి బలహీనతలు. పెద్దయ్యేకొద్దీ మనం బలహీనతల్ని అధిగమించి, బలం వైపుకు కదలాలి. ఈ కథ చదవండి..*

*రచన: ప్రసన్న, 7 వ తరగతి, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, తెల్లాపూర్, రంగా రెడ్డి జిల్లా, తెలంగాణ.*

*మార్పు చేర్పులు: కొత్తపల్లి.*

రామయ్య ఒకరోజు రాత్రి భోజనం చేసాక తోటకి బయలుదేరాడు.

అవి అమావాస్య రోజులు, దాంతో వెన్నెల కూడా లేదు. కొంచెం దూరం పోయే సరికి 'గాలి కొంచెం బరువెక్కిందా' అనిపించింది.

దూరంగా చింత చెట్టు పైన కావచ్చు- నల్ల చీర కట్టుకొని, గజ్జెలు కట్టుకున్న కాళ్లని ఘల్లు ఘల్లున ఊపుతూ చెట్టు మీద కూర్చుని ఉన్నది ఏదో ఆకారం.

రామయ్య 'అరే! ఏంటి, ఆ చప్పుడు?!' అని

జాగ్రత్తగా చూసాడు. చెట్టు మీద ఏవో ప్లాస్టిక్ పేపర్లు.. మనిషంటూ ఎవరూ కనిపించలేదు. 'కానీ శబ్దం ఎలా వస్తున్నది?' తెలీలేదు. 'దయ్యం కావచ్చు!' రామయ్య భయంతోటే 'చెట్టు మీద దయ్యం నాకేం భయ్యం' అనుకుంటూ ముందుకు సాగాడు.




కాసేపటికి పెద్దకొండ వచ్చింది. కొండను చూడగానే రామయ్య ప్రాణం కూడా లేచి వచ్చింది. 'అమ్మయ్య! పెద్దకొండ వచ్చేసింది. దీన్ని దాటేస్తే చాలు మా పొలం వస్తుంది' అని సంతోషం వేసింది.

కొండ మలుపులోనే, ముళ్ల చెట్టు కింద ఓ పెళ్లి కూతురు నిలబడి ఉన్నది- 'అయినా పెళ్ళి కూతురు ఇట్లా చీకట్లో, మలుపు మీద, ముళ్లచెట్టు క్రింద ఎందుకు నిలబడి ఉంటుంది? ఈమె పెళ్ళి కూతురు కాదు- పెళ్ళి కూతురు లాంటి-'

"నన్ను కాపాడండి! మీకు పుణ్యం ఉంటుంది" అన్నదామె, అకస్మాత్తుగా.

ఒక్కసారిగా వణికి పోయి, మళ్ళీ తేరుకున్నాడు రామయ్య. 'గొంతు మనిషి గొంతులాగానే ఉంది అచ్చం!' అనుకున్నాడు "పుణ్యం అంటోంది చూడు, పుణ్యం! దయ్యాలకు పుణ్యం పాపం తెలుస్తాయా?.."

"నన్ను కాపాడండి! మీరెవరో మంచి వాళ్ళలా ఉన్నారు. నన్ను మీ ఇంటికి తీసుకుపొండి. ఇంట్లో దాచండి కొన్ని రోజులు! ప్లీజ్.." ప్రాధేయపడిందది.

"ఇంగ్లీషు వచ్చిన దయ్యం, చూసావా? ప్లీజ్ అంటున్నది'.. పైకి మటుకు "ఏమైందమ్మా?! ఇంత అర్థరాత్రివేళ ఇక్కడేం చేస్తున్నావు? మీది ఏ ఊరు?" అని అడిగాడు. 'మాట్లాడే

దయ్యం' అని మనసులో అనుకుంటూ.

దయ్యం వలవలా ఏడ్చింది. రామయ్యకు మనసు క్రుంగిపోయింది. కాళ్ళు వణికాయి. "నాకు బలవంతంగా పెళ్లి చేస్తున్నారు. నాకేమో చదువుకోవాలని ఉంది. చదువుకొని పెద్ద ఉద్యోగం చేస్తాను. ఈ పెళ్ళి గిళ్ళి వద్దు. అందుకే నేను రాత్రికి రాత్రి పారిపోయి వచ్చాను. ఇంత వరకూ వచ్చాను గానీ, ఇప్పుడు ఏం చేయాలో తెలీక ఏడుస్తున్నాను" అన్నది.

రామయ్య ఆ దయ్యం కాళ్ల కేసి చూసాడు. పారాణి పెట్టుకొని ఉంది ఎర్రగా. కాళ్ళు కొంచెం ప్రక్కకు తిరిగి ఉన్నాయా అనిపించింది. 'దీన్ని ఎట్లా వదిలించుకోవాలి దేవుడా?' అని మనసులోనే ఆంజనేయస్వామిని తలచుకున్నాడు.

మాట్లాడకుండా వెనక్కి తిరిగి ఊరివైపు అడుగులు వేసాడు. 'ఇది నా వెంట రాదు- రాదు- రాదు ఆంజనేయా! ఆంజనేయా!' అనుకుంటూ.

గజ్జెల శబ్దం అతన్ని అనుసరించింది. రామయ్య వెనక్కి తిరిగి చూడకుండా గబగబా నడిచాడు. గజ్జెల శబ్దం కూడా వేగం పుంజుకున్నది.



కొద్ది సేపటికి రామయ్యకు ఒక ఐడియా వచ్చింది. 'దయ్యాలకు నిప్పు అంటే భయం!' తను అగ్గి పెట్టె తీసి, బీడీ వెలిగించుకుంటూ మెల్లగా వెనక్కి తిరిగి చూసాడు. గజ్జెల దయ్యం రెండడుగులు వెనక్కి వేసింది. అతను ఒక్కసారిగా ఊపిరి పీల్చుకొని గబగబా నడక మొదలెట్టాడు.

గజ్జెల శబ్దం వెన్నంటే వస్తోంది. కొంచెం

దూరంగా ఉన్నట్టుంది.

ఊళ్ళోకి వచ్చాక, "ఇప్పుడింక ఇది భస్మమైపోతుంది చూడు!" అనుకుని ఆంజనేయస్వామి గుడి ముందు నిలబడి గట్టిగా మొక్కుకున్నాడు రామయ్య.

గజ్జెల శబ్దం ఆగిపోయింది.

గట్టిగా నవ్వుకొని, అయినా వణికే కాళ్లతో కంగారుగానే స్వామికి మళ్ళీ ఓసారి మొక్కుకొని, నడక మొదలెట్టాడు రామయ్య.

మళ్ళీ మొదలైంది గజ్జెల శబ్దం. ఈసారి అది అతని ప్రక్కనే నడుస్తోంది. రామయ్యకు ఇప్పుడు తల త్రిప్పేందుకు కూడా భయం వేసింది.

"ఇంట్లోకి పోవాలా, వద్దా?" అనుకున్నాడు.

నేరుగా పోలీసు కానిస్టేబుల్ వీరాస్వామి ఇంటి తలుపు తట్టాడు. "ఓ సారూ! ఓ సారూ! నేను రామయ్యని. అర్జంటుగా తలుపు తియ్యాల" అంటూ.

వీరాస్వామి తలుపు తెరిచి "లోనికి రా! ఏంటి సంగతి?" అన్నాడు.

"ద.. దయ్యం వచ్చింది నా వెనకనే!" గుసగుసగా చెప్పాడు రామయ్య.

వీరాస్వామి టార్చి వెలుగులో చూసాడు. అవతల మూలగా నిలబడి ఉన్నది ఒక అమ్మాయి, పెళ్ళి కూతురు వేషంలో.

"ఈమె దయ్యం కాదు. మనిషే. ఏదో సమస్యలో ఉన్నట్లుంది. లైటు వేస్తాను ఆగు" అని లైటు వేసాడు. "వెలుగులో మాయం ఐపోతుంది" అనుకున్న ఆ పిల్ల నిక్షేపంగా నిలబడి ఉంది అక్కడ, ముఖం అంతా కన్నీళ్ళ చారికలతో.

వీరాస్వామి ఆమెను, రామయ్యని కూడా పోలీసు స్టేషనుకు పిల్చుకెళ్ళి, కేసు నమోదు చేయించాడు. తర్వాత పోలీసుల చొరవ వల్ల ఆ అమ్మాయి తల్లిదండ్రులు, బంధువర్గం అంతా ఆమెని పై చదువులు చదివించేందుకు అంగీకరించారు. ఆ అమ్మాయిని ప్రభుత్వ హాస్టల్ లో చేర్చి, కాలేజీలో చదువుకునే ఏర్పాటు చేసాడు వీరాస్వామి.

ఆరేళ్ల తర్వాత ఆ పాప పోటీ పరీక్షల్లో నెగ్గి ప్రభుత్వ అధికారి ఐనప్పుడు, వాళ్ల తల్లిదండ్రులు వచ్చి వీరాస్వామికి, రామయ్యకి ధన్యవాదాలు చెప్పుకున్నప్పుడు వాళ్లకి కలిగిన సంతోషం ఇంతా ఇంతా కాదు!

"ఐనా ఇట్లా ఏ పాపకీ జరగకూడదు. నేను ఎదురయ్యాను కాబట్టి సరిపోయింది. వేరే ఏ దుర్మార్గులో ఎదురయ్యుంటే ఆ పాప గతి ఏమౌను?!" అన్నాడు రామయ్య, పోలీసు వీరాస్వామితో.



**లోగుట్టు!**

డాక్టర్: మీరు బయట తినకండి. లేకపోతే ఎలర్జీ తగ్గదు.

రామారావు: అలాగేనండి. ఇంట్లోనే తింటాను. బయట కొనుక్కున్నా సరే- ఇంటికి తెచ్చుకునే తింటాను.

**నిరసన!**

తండ్రి: అదేమిట్రా! నుంచుని తింటున్నావెందుకు?!

కొడుకు: భార్య సంపాదిస్తుంటే కూర్చుని తింటున్నానని మీరు తిట్టారుగా? అందుకే!



**ఆధునిక విజ్ఞానం!**

టీచర్: బిట్టూ! 16 వ శతాబ్దం నాటి రాజుల గురించి నీకేమైనా తెలుసా?

బిట్టూ: తెలుసు టీచర్

టీచర్: గుడ్..ఏం తెలుసో చెప్పు?

బిట్టూ: వాళ్ళంతా చనిపోయారు టీచర్!








**మూల కారణం!**

టీచర్: రాముా! భూకంపాలు ఎప్పుడు వస్తాయి?

రాము: భూమి సూర్యుడి చుట్టూ తిరిగి తిరిగి, కళ్ళు తిరిగి పడిపోయినప్పుడు టీచర్!

భార్య: ఏం చేస్తున్నారక్కడ?

వెంగళప్ప: మొక్కలకి నీళ్ళు పోస్తున్నాను

భార్య: వర్షం పడుతోందిగా!

వెంగళప్ప: ఫర్వాలేదు! గొడుగు వేసుకొనే పోస్తున్నా...!



# ఏదో ఒకటి

*రచన: పి.శ్రావణి, 7 వ తరగతి, Z.P.H.S. తెల్లాపూర్, రంగారెడ్డి జిల్లా.*

అనగనగా ఒక ఊళ్లో రాజు, రాము, సోము, రవి అనే నలుగురు అన్నదమ్ములు ఉండే-వాళ్ళు. వాళ్ళకు ఓ చిన్న పొలం, కొన్ని కోళ్ళు, మేకలు ఉండేవి.

ఒకసారి వాళ్ళ అమ్మ-నాన్నలు "ఇదిగో! మేం మళ్ళీ ఓ వారం రోజుల్లో వచ్చేస్తాం. ఆలోగా అన్నదమ్ములు నలుగురూ 'ఏదో ఒకటి' చేసుకొని తినండి!" అని చెప్పి పొరుగూరు వెళ్ళారు.

"ఏదో ఒకటి అంటే ఏంటి?" అని వాళ్ళకి అనుమానం వచ్చింది.

"ఇదిగో, మనం 'ఏదో ఒకటి' చేసుకొని తినాలి. అందరం తలా ఒక దారిన వెళ్ళి 'ఏదో ఒకటి ఎక్కడ దొరుకుతుందో చూద్దాం. తలా కొంచెం ఏదో ఒకటి తేకుండా వెనక్కి రావద్దండి' అన్నాడు పెద్దన్న రాజు.

దాంతో నలుగురు అన్నదమ్ములూ నాలుగు దిక్కుల్లో వెళ్లారు.

పెద్దవాడు రాజు, కొందరు బాటసారులతో పాటు తూర్పు దిక్కుకు పోతూంటే ప్రక్కనున్న పొదలోంచి అకస్మాత్తుగా ఏదో గుడగుడమన్నది. "ఏంటది?" అని అడిగాడు రాజు, తోటివాళ్లని. "ఏదో ఒకటి, ఏదైతేనేం, మన దారిన మనం పోదాం" అన్నారు వాళ్ళు.

"దొరికిందిరా! ఏదో ఒకటి దొరికింది!" అని

వాడు ఆ పొద చుట్టూ తిరిగి, జాగ్రత్తగా దాని లోపల ఉన్న ప్రాణిని పట్టుకున్నాడు. తీరా చూస్తే అది ఓ అడవి కోడి. "మరి ఏదో ఒకటి అన్నారేంటి?" అని ఆశ్చర్యపోయాడు వాడు.




"ఇది కోడే గదా! మరేంటో అనుకొని చాలా భయపడ్డాను" అనుకొని వాడు దాన్ని పట్టుకొని వెనక్కి తిరిగాడు.

ఆలోగా రెండవవాడు రాము పడమర దిక్కుకి పోయే భక్త బృందంతో కలిసాడు. వాళ్ళు దేవర కొలుపు కోసం మేకపోతును నొకదాన్ని పట్టుకొని పోతున్నారు. దారిలో అంతా అది "మే, మే" అని మొత్తు-కుంటోంది. ఆ అరుపులు విని, చుట్టూ ఉన్న అడవిలోంచి అడవి గొర్రెలు కొన్ని వాళ్ల వెంట పడటం మొదలెట్టాయి. "త్వరగా పోండి! ఎక్కువైనాయంటే మనకి సమస్య" అని నడక వేగం పెంచారు వాళ్ళు.

రాము వాళ్ల వెంట పరుగు పెడుతూ "ఏంటది, మన వెంట పడుతున్నది?!" అని అడిగాడు. "ఏదో ఒకటి! మనం త్వరగా పోవటం మేలు" అన్నారు వాళ్ళు.




"ఓహో! 'ఏదో ఒకటి' దొరికింది!" అని రాము అక్కడే ఆగి, నానా తంటాలూ పడి ఒక అడవి గొర్రెను పట్టుకొని, ఇంటి దారి పట్టాడు.

మూడవ వాడు సోము ఉత్తరం వైపుకు రైతులతో కలిసి పోసాగాడు. వాళ్లలో ఒకాయన తన దగ్గర రకరకాల విత్తనాలు ఉన్నాయని చెప్పటం మొదలెట్టాడు.

"మాకూ కొన్ని ఇవ్వరాదూ" అని అతన్ని అడిగారు ఇతరులు. "ఏం రకం విత్తనాలు కావాలి మీకు?" అనడిగాడు ఆయన.

"ఏదో ఒకటి! మొలిస్తే చాలు" అన్నారు వాళ్ళు. అతను వాళ్లందరికీ తలా కొన్ని విత్తనాలు ఇచ్చాడు. సోము కూడా వాటిని తీసుకొని సంతోషంగా వెనక్కు తిరిగాడు.




ఇక నాలుగోవాడు రవి, ఒట్టి పని దొంగ. అన్నలంతా ఏదో ఒకటి తెచ్చేందుకు పోగానే, వాడు బయలుదేరి, ఈత కోసమని చెరువు దగ్గరికి పోయాడు. అక్కడ కొద్దిసేపు ఈదులాడాక, వాడికి చేపలు పట్టేవాళ్ళు కొందరు కనబడ్డారు. వాళ్లతో కలిసి సంతోషంగా కొన్ని చేపలు పట్టాడు వాడు.




"వీటిని ఇంటికి తీసుకువెళ్తే మా అన్నలు సంతోషపడతారు; అందరం చేపలకూర చేసుకోని తినచ్చు" అనుకొని, ఆ చేపల్ని పట్టుకొని ఇంటికి బయలు దేరాడు.

అందరూ ఇల్లు చేరుకున్నారు గానీ, 'ఆరోజు ఏం వండుకోవాలి' అనేది తేలలేదు.

చిన్న తమ్ముడు రవి చెప్పాడు తెలివిగా: "మీరు ముగ్గురూ 'ఏదో ఒకటి' తెచ్చారు;

నేను ఒక్కడినే కదా, చేపలు తెచ్చింది? అవి సరిగ్గా నిలవ ఉండవు కూడాను. కాబట్టి ఏం చేద్దామంటే, మీరు తెచ్చిన వాటిని మనం పెంచుదాం!

పెద్దన్నయ్య తెచ్చిన కోడిని పెంచితే మనకు ఉన్న కోళ్ళు ఇంకా ఎక్కువ అవుతాయి. అట్లాగే రెండో అన్నయ్య తెచ్చిన గొర్రె కూడా. దాని వల్ల మనకున్న గొర్రెలు పెరుగుతాయి. మూడో అన్న తెచ్చిన గింజల్ని తోటలో వేస్తే కూరగాయలు వస్తాయి. అవి అన్నీ పెరిగాక, అప్పుడింక రోజూ 'ఏదో ఒకటి' తినచ్చు!

ఆలోగా నేను రోజూ చెరువుకు వెళ్ళి చేపలు తెస్తాను. మీరు కోళ్ళను, మేకలను, పెంచుతూ తోటపని చేసుకొని రండి, అంతలోకే నేను మీకు మంచి చేపల కూర వండి పెడతాను.." అని. అందరూ వాడి తెలివిని, ఆలోచనను మెచ్చుకున్నారు.

అట్లా నలుగురూ తమకు ఇష్టమైన పనులు చేసుకుంటూ సంతోషంగా గడిపారు.

**పరిశుభ్రమైన హోటల్!**

సర్వర్ (నవ్వుతూ) : మా హోటల్ హల్వా ఎలా ఉంది సర్?!

రవి (నవ్వుతూ) : మీకు ప్రతీదీ శుభ్రంగా ఉంచడం అలవాటు కదా?

సర్వర్ (ఆశ్చర్యంగా) : అవునండి! మీకెలా తెలిసింది?!

రవి : ఏం లేదు.. ఏలకుల వాసన కంటే విమ్ సబ్బు వాసనే ఎక్కువ వస్తుంటేను!

**రహస్యం!**

శీనా: ఉత్తరం మీద చిరునామా రాయకుండానే పోస్ట్‌బాక్స్‌లో వేశావేంట్రా?!

రాము: ఎవరికీ తెలీకుండా రహస్యంగా పంపుతున్న ఉత్తరంరా, అది!!

**చిన్న తేడా!**

రవి: అలారానికి, పలారానికి ఏమైనా సంబంధం ఉందా?

శశి: ఉంది. కోడిపుంజు కూస్తే అలారం; కోస్తే పలారం!

**ఇద్దరూ వేలే!**

తల్లి (ప్రైవేటు కాలేజీ కరస్పాండెంటు తో) : మావాడి పేరు ఏకలవ్యుడు అని పెట్టాల్సింది సర్.

కరస్పాండెంట్: అదేమి?

తల్లి: ఆయన వేలు కోసి చదువుకున్నాడు; మావాడు వేలు పోసి చదువుకుంటున్నాడు..






# మాయ రోలు

తెలుగు జానపద కథ

రచన: సయ్యద్ హీనా కౌసర్, 7 వ తరగతి, క్రాస్వర్డ్ స్కూల్,గుంటూరు.

అనగనగా ఒక ఊళ్లో ఒక అన్న, ఒక తమ్ముడు ఉండేవాళ్ళు. అన్నయ్య చాలా ధనవంతుడు; తమ్ముడు చాలా పేదవాడు. తమ్ముడేమో చాలా మంచివాడు; అన్నేమో చాలా చెడ్డవాడు.

ఒక సంవత్సరం ఏమైందో, తమ్ముడి వ్యాపారం అస్సలు సరిగ్గా జరగలేదు. ఏ పని పెట్టుకుంటే అందులో నష్టం ఎదురైంది. చివరికి కుటుంబం మొత్తం పస్తులుండే పరిస్థితి ఎదురైంది. అందరూ అన్నారు "మీ అన్నని సాయం అడగరాదా? ఆయన వ్యాపారం బాగా జరుగుతున్నది గదా?" అని.

దాంతో ఓ పండగ రోజున అన్నయ్య దగ్గరకు వచ్చాడు తమ్ముడు- "అన్నా! పరిస్థితులు సరిగా లేవు. కష్టంగా ఉంది. నువ్వు కొంచెం డబ్బు సాయం చేస్తే సమస్యల్లోంచి బయటపడతాను. ఆపైన నీ అప్పు తప్పక తీర్చుకుంటాను" అన్నాడు.



అన్నయ్యకు అతన్ని చూడగానే చికాకు వేసింది. "ఛ! పొద్దున్నే లేవగానే ఎవరి ముఖం చూశానో, ఇప్పుడు నీ ముఖం చూడాల్సి వస్తున్నది. ముందు ఇక్కడి నుంచి ఫో!" అంటూ గొంతు పట్టుకొని బయటకు నెట్టేశాడు.

తమ్ముడు ముఖం వ్రేలాడ వేసుకొని ఇంటికి పోతుండగా ఓ ముసలివాడు కనిపించాడు. కట్టెలమూటని పైకి ఎత్తుకోవటం రాక కష్టపడుతున్నాడతను. తమ్ముడికి జాలి వేసి అతనికి సాయం చేస్తూ "ఎక్కడి వరకూ తాతా?" అని అడిగాడు. తాత చాలా దూరం పోవాల్సి ఉంది. "అయ్యో అంత దూరం నీవల్ల ఏమవుతుంది?" అంటూ తమ్ముడు ఆ మూటని తనే ఎత్తుకొని అతని ఇంటి వరకూ మోసుకువచ్చాడు.

ఆ ముసలి తాత అతనికి ధన్యవాదాలు చెబుతూ, "దేవుడు నీకు మేలు చేస్తాడు నాయనా! నీకు అన్నీ శుభాలే జరుగుతాయి" అన్నాడు.

అది వినగానే తమ్ముడికి తన కష్టాలు గుర్తుకొచ్చి కళ్లలో నీళ్ళు తిరిగాయి.

అది గమనించి తాత "చూడు బాబూ! కష్టాలు, సుఖాలు అందరికీ వస్తూ పోతూ ఉంటాయి. ఏవీ శాశ్వతంగా ఉండవు. తెలివైనవాడు కష్టాలకు క్రుంగిపోడు; సుఖాలకు పొంగిపోడు" అని చెప్పి, తన ఇంట్లోకి వెళ్ళి ఒక తీపి రొట్టెను తెచ్చి ఇచ్చాడు. "నా మాటలు జాగ్రత్తగా విను నాయనా! నా ఇంటి వెనుక ఒక చిన్న అడవి ఉంది. ఆ అడవి చివర మూడు మల్బరీ

చెట్లున్నై. వాటి వెనుకగా కొండపైకి ఒక కాలి బాట ఉంటుంది.

ఆ బాటకు రెండు వైపులా ముళ్ళ చెట్లే ఉంటాయి. ఒక్క ముల్లు కూడా గుచ్చుకోకుండా జాగ్రత్తగా కొండ ఎక్కి పోతే అక్కడో గుడిసె కనిపిస్తుంది. ఆ గుడిసెలో ముగ్గురు మరుగుజ్జులు ఉంటారు. వాళ్లకు ఈ రొట్టెను ఇచ్చి, "పని కోసం వెతుకుతున్నాను- మీరు ఏ పని చెబితే అది చేస్తాను" అను. వాళ్ళు ఏ పని చెబితే అది చేయి. అప్పుడు వాళ్ళు నిన్ను మెచ్చుకొని "నువ్వు మంచివాడివిరా, నీకు ఏం కావాలో అడుగు, ఇస్తాం" అంటారు.

అప్పుడు నువ్వు "మీకు వీలైతే నాకు ఒక మాయారోలు ఇప్పించండి- లేకపోతే మీ ఇష్టం" అను. ఆపైన ఎట్లా జరగాలో అట్లా జరుగుతుంది" అని దీవించి పంపాడు.

తమ్ముడికి ఆశ్చర్యం వేసింది. "ముసలాయన ఇంత నమ్మకంగా చెబుతున్నాడు. పట్నం మధ్యలో ఇక్కడ అసలు కొండే లేదు కదా" అనుకున్నాడు. అయితే ఇంటి వెనకగా వెళ్ళి చూస్తే నిజంగానే అక్కడో అడవి కనిపించింది. ఆ చిన్న అడవిలోనే నిండా భయంకరమైన పాములు ఉన్నాయి.

వాటిని అన్నిటినీ తప్పించుకొని ముందుకెళ్తే నిజంగానే మూడు మల్బరీ చెట్లు కనిపించాయి.




వాటి వెనకనే కాలిబాటకూడా కనిపించింది. ముళ్ళన్నీ తప్పించుకుంటూ జాగ్రత్తగా ఆ బాట వెంబడి నడుస్తూ పోయాడు. కొండపైన ఉన్న కోతులను కూడా తప్పించుకొని పోయి చివరికి తాత చెప్పినట్లే ఓ గుడిసెకు చేరుకున్నాడు.

గుడిసెలో ఉన్న మరుగుజ్జులకు తను తెచ్చిన రొట్టెను ఇచ్చి, తాత చెప్పమన్నట్లే "పనికోసం

వెతుకుతున్నాను" అని చెప్పాడు. వాళ్ళు గట్టిగా నవ్వి, "పని కావాలా, మేం తిన్న అన్నం గిన్నెలు పెద్ద కుప్ప పడి ఉన్నై.

అవన్నీ శుభ్రం చేస్తావా?" అన్నారు. "సరే" అని తమ్ముడు ఆ గిన్నెలన్నీ శ్రద్ధగా తోమిపెట్టాడు.




వాళ్ళు వాడిని మెచ్చుకొని "నీకేం కావాలి?" అని అడిగి, వాడు కోరినట్లే ఒక మాయరోలును తెచ్చి ఇచ్చారు. "నీకు ఏం కావాలన్నా దీన్ని రుద్ది, మర్యాదగా అడుగు. రోజుకు ఒకసారి మాత్రం పని చేస్తుందిది" అన్నారు.

తమ్ముడు వాళ్లకు నమస్కరించి, రోలును రుద్ది, మర్యాదగా "నేను మా ఇంటికి చేరాలి" అని కోరుకున్నాడు. మరుక్షణం వాడు తన ఇంట్లో ఉన్నాడు!

అతను దాన్ని ఇంట్లో దేవుని గూడులో పెట్టి, జాగ్రత్తగా చూసుకుంటూ, రోజూ అదిచ్చే సంపదల్ని వ్యాపారం ద్వారా మరింత వృద్ధి చేస్తూ పోయాడు. అనతి కాలంలోనే అతని అప్పులన్నీ తీరటమే కాక, సమాజంలో మంచి పేరు ప్రతిష్ఠలు, మర్యాద, మన్నన ఏర్పడ్డాయి.

అయితే అటువైపున దుర్మార్గుడైన అన్నకు తమ్ముడి పరిస్థితిని చూసి అసూయ వేయసాగింది. అతను ఒక రోజున తమ్ముడి ఇంటికి వచ్చి ప్రేమ నటిస్తూ "తమ్ముడూ! మొన్నటికి మొన్న నువ్వు పరిస్థితి బాగాలేదు" అని నా దగ్గరికి వచ్చావు. ఇంత తక్కువ సమయంలో నీ దశ ఎట్లా తిరిగింది?" అని ఊరికే అడిగినట్లు అడిగాడు. తమ్ముడు అమాయకంగా తనదగ్గరున్న రోలును చూపించాడు.

దుర్మార్గుడైన అన్న రాత్రికి రాత్రి ఆ రోలును దొంగిలించుకొని పోయి, "ఇది ఉంటే నాకు,

నా కుటుంబానికి ఇంకేమీ అక్కరలేదు" అంటూ పరదేశం వెళ్ళిపోయేందుకై పడవ ప్రయాణం మొదలెట్టాడు.

ఆ రోజు ఉదయం "మీ తమ్ముని మాటలు నమ్మి ఇట్లా బయలుదేరాం. ఇంతకీ ఈ రోలు మనం కోరుకున్నది ఇస్తుందా?" అన్నది అతని భార్య అనుమానంగా. అన్న "ఇస్తుంది" అంటూనే రోలుని రుద్ది, నాకు లెక్కలేనంత బంగారం కావాలి" అని కోరుకున్నాడు.

మరుక్షణం రోలులోంచి బంగారం రావటం మొదలైంది. ఇంక ఏం చేసినా ఆ బంగారం ప్రవాహం ఆగలేదు. దాని బరువుకు వాళ్ల పడవ, పడవతోబాటు రోలు, అన్న కుటుంబం మొత్తం సముద్రం పాలైంది.

**పీడ విరగడ!**

భార్య: దోమలు బాగా కుడుతున్నాయండి. ఏ ఆలౌటో వెలిగించుకోవాలి.

పిసినారి వెంగళ్: వెలిగించుకుంటే ఊరికే గాల్లో కలిసిపోతుంది. త్రాగేస్తే సరి! ఆపైన మనల్ని కుట్టిన దోమలన్నీ చచ్చి ఊరుకుంటాయి.

**వాస్తవం!**

జర్నలిస్టు : మిమ్మల్ని బాగా ప్రభావితం చేసిన బుక్స్ ఏవి?

నాయకుడు : ఓ నాలుగైదు ఉంటాయి. అన్నీ బ్యాంకు వాళ్ళిచ్చిన చెక్కు బుక్కులే.

**పోయే కాలం**

క్విజ్ మాస్టారు : గడియారం పదమూడు గంటలు కొట్టిందంటే, అది ఏమి సమయం?

సోము : రిపేర్ సమయం సర్!

**గౌరవం!**

అల్లరి చిల్లర కొడుకు : డాడీ! పార్టీకి కార్ తీసుకెళ్తాను డాడీ!

తండ్రి : ఎందుకురా నాన్నా?!

అల్లరి చిల్లర కొడుకు : ఎంత వాహనంలో పార్టీకెళ్తే అంత గౌరవం డాడ్! పది లక్షల కారు! సూపర్!

తండ్రి : బస్సయితే యాభై లక్షలు! ఇదిగో బస్సు టిక్కెట్టు డబ్బులు పది రూపాయలు పట్టుకెళ్ళు!




# పిల్లలు-ఏనుగులు

బొమ్మకు కథ రాసా- 1

*రచన: పి.కృష్ణ, 9 వ తరగతి, Z.P.H.స్కూల్, రామచంద్రాపురం, హైద్రాబాద్*




ఆ రోజున ఆలస్యంగా నిద్రలేచాం, నేను, మా చెల్లి ఇద్దరం. గడియారం చూసుకొని, ఆదరాబాదరాగా తయారై బడికి పరుగు పెట్టాము.

ఆ సరికే మా తెలుగు క్లాసు మొదలయిపోయింది. తెలుగు టీచర్ గారు అడవి గురించి, అడవి జంతువుల గురించి చెబుతున్నారు. నేను "లోపలికి రావచ్చా టీచర్" అని అడిగి, వెళ్ళి సర్దుకుని కూర్చునే

సరికి, టీచరుగారు ఏనుగుల గురించి చెబుతున్నారు. వేరే ఆలోచించే అవకాశం ఏమీ లేకనో, ఏమో, ఆవిడ చెప్పిన సంగతులన్నీ బాగా ఎక్కాయి నా మనుసులోకి.

అందుకనే ఆ రోజు రాత్రి పడుకునేముందు నానమ్మని ఏనుగు కథే చెప్పమన్నాను. రోజూ నానమ్మ చెప్పే కథలు వింటూ పడుకోవటం అలవాటు నాకు..

ఒకసారి నేను, మా చెల్లి, బడిపిల్లలు, ఉపాధ్యాయులు అందరం కుంతలగుండు అడవి చూసేందుకని వెళ్లాం. అడవిలో కొంచెం దూరం పోయాక, డ్రైవరు బస్సుని ఒక మలుపులో ఆపి, "అల్పాహారం తిని రండి!" అన్నాడు.

ఆ సరికి అందరమూ మంచి ఆకలి మీద ఉన్నాం. గబగబా ఎవరు తెచ్చుకున్న టిఫిన్ బాక్సులు వాళ్లం పట్టుకొని బస్సు దిగాం. నేను, మా చెల్లి కొంచెం దూరం వెనక్కి నడిచి, అక్కడ చెట్ల నీడలో కూర్చున్నాం.

అయితే మేం టిఫిన్ తిని చూసేసరికి, మా బస్సు కాస్తా వెళ్ళిపోయింది!

ఇక మా చెల్లి ఏడుపు మొదలెట్టింది. "చెల్లీ! నువ్వు ఇదేనా, నేర్చుకున్నది? బడిలోనూ, ఇంట్లోనూ మనకు ఏం చెప్పారు- 'కష్టతర పరిస్థితులలో ధైర్యంగా ఉండాలి' అని చెప్పారా, లేదా?" అని కాస్త ధైర్యం ఇచ్చాను.

నిజానికి నాకు కూడా ఏడుపొచ్చేలా ఉంది; కానీ 'నేను ఏడుస్తూ ఉంటే నాకన్నా చిన్నది- అది ఊరుకుంటుందా?' అని, అలా నేను చాలా ధైర్యంగా ఉన్నట్టు నటించానన్నమాట.

అయినా ఎటు నుండి ఏ జంతువు మీదికి దూకుతుందో ఏమో' అని నాకైతే ప్రాణాలు ప్రాణాల్లో లేవు; ఏదో ఓ పెద్ద చెట్టుకింద కూర్చున్నాంగానీ.

అడవిలో వాతావరణం అంతా తేమగా, చల్లగా ఉంది. కొద్ది సేపటి తర్వాత గాలి అంతా బరువు బరువుగా కూడా అనిపించింది. ఆకాశం మొత్తం నల్లటి మేఘాలతో మూసుకొని ఉంది. "వానపడుతుందేమో"

అన్నది చెల్లి.

ఇంతలో దగ్గర్లో ఏదో పిడుగు పడ్డట్టు పెద్ద శబ్దం వినిపించింది. ఇద్దరం చెంగున ఎగిరి పడ్డాం.

మా చుట్టూతా పొగమంచు కమ్ముకున్నది. ఆశ్చర్యమే- అంతకు ముందు కనిపించిన రోడ్డు మాకు ఇప్పుడు కనిపించట్లేదు. ఐదారు అడుగుల దూరం తర్వాత, ఇంక అంతా మంచే.

అంతలో ఆ పొగమంచులో మసకగా ఏదో ఆకారం కనిపించి, ఇద్దరం బిర్ర-బిగుసుకుపోయాం. అదేదో సింహం కావచ్చు.. సరిగా కనిపించట్లేదు.. ఒకటి కాదు- రెండు ఉన్నట్లున్నాయి. ఒకటి చిన్నగాను, ఒకటి పెద్దగాను..

"కదలకు. కదిలితే మనం ఇక్కడున్నట్లు తెలుస్తుంది వాటికి!" అన్నాను చెల్లెతో గుసగుసగా.

కొద్ది సేపటికి, ఆ ఆకారాలు మరింత దగ్గరికి వచ్చాక, తెలిసింది- మాకు ముందుగా కనిపించింది ఒక ఏనుగు పిల్ల. ఆ ప్రక్కన ఉన్నది వాళ్ల అమ్మో, నాన్నో అయి ఉండచ్చు, చాలా పెద్దగా ఉంది, ఇంతింత పెద్ద కోరలతో.

ఏనుగులు రెండూ మాకు అల్లంత దూరాన నిలబడ్డాయి.



మమ్మల్ని చూడగానే అవి రెండూ ఆగిపోయి బొమ్మల్లాగా నిలబడినై. ఇక్కడ మేం కూడా అంతే. అంతలోనే పెద్ద ఏనుగు తొండం పైకెత్తి గట్టిగా ఘీంకరించటం మొదలెట్టింది. చిన్న ఏనుగు దాని కాళ్ళ చుట్టూ తిరగటం మొదలు పెట్టింది.

మాకు ఏం చేయాలో తెలీలేదు. "ఈ ఏనుగేదో దాని తోటి మందని పిలుస్తున్నట్లుంది. అవన్నీ కలిస్తే మనల్ని ఏం చేస్తాయో!" అన్నాను నేను.

"అదేమీ కాదు. నాకు అర్థమైంది. ఆ ఏనుగు మనల్ని దగ్గరికి రమ్మంటోంది. దానికి ఏదో

సమస్య ఉందని చెబుతున్నది అది" అన్నది చెల్లి. కొంచెం సేపటికి ఏనుగు ఘీంకరించటం అయిపోగానే దానివైపుకు రెండు అడుగులు వేసాను నేను.




వెంటనే అది మళ్ళీ అరవటం మొదలెట్టింది. ఆపగానే నేను ఇంకొంచెం దగ్గరికి వెళ్ళాను. చిన్న ఏనుగు ఇప్పుడు దాని వెనకకాళ్ల చుట్టూ తిరుగుతూ నాకేసే భయం భయంగా చూస్తోంది.

"అన్నయ్యా! మన బ్యాగులో డజను అరటిపళ్ళున్నై కదా, దీనికి పెట్టు పాపం" అంది చెల్లి, నా వెనకనుండి. నేను వెనక్కి తిరిగి వెళ్ళి తన చేతిలోంచి అరటిపళ్ళు తీసుకున్నాను. ఆలోగా రెండు ఏనుగులూ మా దగ్గరికే వచ్చేసాయి. నేను ఇచ్చిన అరటిపళ్లను తల్లి ఏనుగు తీసుకొని, కొన్ని పిల్లకు ఇచ్చి, కొన్ని తను తిన్నది.

ఆలోగా చెల్లి ఆ ఏనుగుల చుట్టూ తిరిగి వచ్చి చెప్పింది- "దీని సమస్య అర్థమైంది. వెనక కాలికి కుడి వైపుగా పెద్ద గాయం అయ్యింది దీనికి" అని. "నానమ్మ చెప్పే కథల్లో లాగా ఏమైనా ఆకులు తీసుకొచ్చి కట్టు కడదాంరా దీనికి, పాపం" అంది.

"సరే" అని నేను వెళ్ళి నాకు తోచిన ఆకులన్నీ తెచ్చాను. వాటినన్నిటినీ నేను, చెల్లి ఇద్దరం అక్కడున్న రాళ్ళమీద నూరాం. అంతసేపూ ఏనుగులు రెండూ ప్రశాంతంగా నిలబడి చూసాయి. దాంతో మాకు అవంటే భయం పోయింది.

ఆ ఆకులన్నిటినీ మేం తెచ్చుకున్న "టవల్" లో వేసి, "నీ కాలికి కడతాం" అని సైగలు చేసుకుంటూ మెల్లగా పోయాను ఏనుగు దగ్గరికి. వెంటనే చిన్న ఏనుగు దూరంగా

పరుగు తీసింది. "పెద్ద ఏనుగు ఏమంటుందో" అని ఒక్క క్షణం భయపడ్డాను కానీ, అది ఏమీ అనలేదు. పై పెచ్చు వెనక్కి తిరిగి దాని కాలుని నాకు దగ్గరగా జరిపింది!




"ఏనుగు చాలా తెలివైన ప్రాణి" అని గుర్తు చేసుకున్నాను నేను. దాని వెనకనే నేలమీద కూర్చొని, దాని కాలికి కట్టు కట్టాను. అలోగా చిన్న ఏనుగు కూడా మా దగ్గరికి వచ్చి, ఆప్యాయంగా మమ్మల్ని రుద్దుకున్నది. దాని చర్మం అంతా గరుకుగాను, మురికిగాను ఉన్నదిగాని, ఆ సమయంలో మాకు అది సంతోషమే అనిపించింది. మేం కూడా ఆ చిన్న ఏనుగు చెవులు పట్టుకుని సరదాగా నవ్వుకున్నాం.

ఇంతలో బస్సు హారన్ వినబడింది. మమ్మల్ని వెతుక్కుంటూ వచ్చారు మా ఉపాధ్యా-యులు. మాకు ఎదురుగా ఏనుగుల్ని చూడగానే వాళ్ళు నిశ్చేష్టులై-పోయారు. "ఏయ్! జాగ్రత్త! వైల్డ్ ఎలిఫెంట్స్! కాళ్లతో తొక్కేస్తై! ప్రమాదం!" అని ఏవేవో చెప్పబోయారు వాళ్ళు. అయితే అంతలోనే నేను అడ్డుపడి విషయం వివరించాను.

మేం బస్సులో ఎక్కేందుకు పోతుంటే ఏనుగులు రెండూ మా వెనకనే నడుస్తూ వచ్చాయి. బస్సెక్కాక తొండాలు ఊపి టాటా చెప్పాయి!

అంతలోనే అమ్మ వచ్చి గట్టిగా కుదిపింది- "నిద్రలేరా! బడికి సమయం కావస్తోంది!" అని!

అప్పుడర్థమైంది- ఇది కల అని! అయినా ఎంత చక్కని కల, కదా?!




# పిల్లలు-ఏనుగులు

బొమ్మకుకథ రాసా-2

*రచన: ఆకాష్ కుమార్, 9 వ తరగతి, A.P.మోడల్ స్కూల్, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*



రంగాపురం చుట్టూ దట్టమైన ఆడవి ఉండేది. ఆ ఊళ్లో ప్రదీప్-కళ అనే అన్నాచెల్లెళ్లు ఉండేవాళ్ళు. వాళ్ళ ఊళ్ళో హైస్కూలు లేదు. పొరుగూరుకు వెళ్ళాలంటే అడవిని దాటి పోవలసిందే.

ఆ సంవత్సరం ఎండాకాలం మొదలవుతున్నదనగా అడవిలో మంటల సమస్య మొదలైంది. పొడి వాతావరణంలో మొదలయ్యే నిప్పు వల్ల, అడవుల్లోని ఎండు గడ్డి అంటుకొని, మంట పెద్దదై, క్రమంగా విస్తరిస్తూ పోతుంది. ఆ దావానలంలో చిన్న మొక్కలే కాదు- పెద్ద పెద్ద చెట్లు కూడా మాడి మసైపోతాయి; అనేక జంతువులు కాలి పోతాయి; క్రూరమృగాలు తప్పించుకొని ఊళ్ళమీద పడతాయి..

అట్లాంటి ఒక రోజున అన్నాచెల్లెళ్ళిద్దరూ బడికి వెళ్తుండగా ఎక్కడో అడవి తగలబడుతున్నట్లు, పొగ! అట్లాగే ఎక్కడినుండో పెద్ద పెద్ద అరుపులు!

'ఏమిటా అరుపులు, అన్నయ్యా?" కళ అడిగింది.



"ఏనుగుల అరుపులు!" చెప్పాడు ప్రదీప్.

"ఎందుకు అరుస్తున్నయో, వెళ్ళి చూద్దామా?" అంది కళ.

ఇద్దరూ రోడ్డు దిగి అడవిలోకి వెళ్ళారు. అక్కడ ఒక తల్లి ఏనుగు, ఒక గున్న ఏనుగు మంటల్లో చిక్కుకొని అరుస్తున్నాయి. వాటి చుట్టూతా కొంత దూరం వరకూ గడ్డి అంటుకున్నది. అవి నిలబడ్డ ప్రదేశం నుండి ఓ ఇరవై అడుగుల దూరాన ఉన్న చెట్లన్నీ అంటుకొని మంటలు క్రక్కుతూన్నాయి. ఎటువెళ్తే తప్పించుకుంటామో తెలీని పరిస్థితి ఏనుగులకు.

ప్రదీప్ వాళ్ల నాన్న అటవీశాఖలో వాచర్‌గా పని చేసాడు. అడవిలో చెలరేగే దావానలాలని ఎలా ఆపాలో ఆయనకు తెలుసు. ఒకసారి ఆయన మంటల్ని ఆర్పేటప్పుడు ప్రదీప్ కూడా వెంట ఉన్నాడు. గాలి ఎటుగా వీస్తున్నదో చూసుకోవటం, మంట మనవైపుకు రాని దిశలో ఆర్పుకుంటూ పోవటం, ఈత పట్టలతో మళ్ళీ మళ్ళీ కొట్టటం ద్వారా మంటని అదుపులోకి తేవటం- ఇలాంటివన్నీ చూసి ఉన్నాడు ప్రదీప్.

ఆ అనుభవంతో అక్కడే ఉన్న ఈత చెట్ల బర్రలు నాలుగు విరిచి, వాటితో తన ముందున్న మంటల్ని ఆర్పుకుంటూ ఏనుగుల వైపుకు దారి చేసాడు. కొద్దిగా దారి దొరకగానే ఏనుగులు రెండూ ఆ దారివెంబడి పరుగెత్తుకొని బయటకు వచ్చేసాయి!

ప్రదీప్, కళ ఇద్దరూ రోడ్డు పైననే మంటలనుండి దూరంగా పరుగు తీసారు. ఏనుగులు రెండూ వాళ్లను అనుసరించాయి. కొంచెం దూరం అట్లా పరుగెత్తాక, "ఇక

ప్రమాదం లేదు" అనిపించిన చోట ఆగి, ఓ ప్రక్కగా బండ మీద వగరుస్తూ కూర్చున్నారు పిల్లలిద్దరూ. ఏనుగులు వాళ్ల దగ్గరికి వచ్చి, రుద్దుకొని తమ కృతజ్ఞతని వ్యక్తం చేసాయి.

ఆ తర్వాత కూడా అవి ఈ పిల్లలిద్దర్నీ గుర్తు పెట్టుకున్నాయి. వీళ్లు బడికి వెళ్తున్నప్పుడు ఒక్కోసారి కనబడేవి అవి. అట్లా కనిపించినప్పుడల్లా ప్రేమగా అరుస్తూ తొండాలు ఊపేవి! ఒక్కోసారి వాళ్ల వెంట కొంచెం దూరం నడిచేవి!




రాను రాను పిల్లలు, ఏనుగులు మంచి స్నేహితులైపోయారు. ఆ సంవత్సరం వేసవి సెలవల్లో వాళ్ళు రోజంతా ఆ అడవిలోనే, ఏనుగులతో పాటు తిరిగారు. అడవి మధ్యలో ఉన్న సరస్సులోకి ఏనుగులతో పాటు దిగి ఈత కొట్టేవాళ్లు; ఏనుగులు తొండాలతో వారి మీదికి నీళ్ళు జిమ్మేవి!

అయితే వేసవి తర్వాత ఆ ప్రాంతంలో వానలు పడలేదు. సరస్సులో నీళ్ళన్నీ కూడా క్రమంగా ఇంకిపోయాయి. చూస్తూ చూస్తూండగానే మెల్లగా అడవంతా ఎండిపోయింది.

మిగతా జంతువులతో బాటు ఈ ఏనుగులు కూడా ఎటో దూరంగా వెళ్ళిపోయాయి. 'మిత్రులు వెళ్ళిపోయారే!' అని బాధ పడుతున్న చెల్లిని ఓదార్చాడు ప్రదీప్- "దాహం వేస్తే త్రాగేందుకు కూడా ఇక్కడ నీళ్ళు లేవు. చూసావుగా, జంతువులకు ఎన్ని కష్టాలుంటాయో?! మన ఏనుగులకు ఏమీ కాలేదు- లోపలి అడవిలోకి వెళ్ళాయి. మళ్ళీ ఎప్పుడో, ఇక్కడి వాతావరణం మారాక మళ్ళీ వస్తాయి. బాధ పడకు!" అని.

అప్పటినుండీ వాటికోసం ఇంకా ఎదురు-చూస్తూనే ఉంది కళ. అవి ఎక్కడున్నాయో, ఎప్పుడొస్తాయో- వాటికి వీళ్ళు గుర్తున్నారో, లేరో మరి.




# పిల్లలు-ఏనుగులు

బొమ్మకుకథ రాసా-3

*"స్నేహితుడి మేలు కోరి, వాడిని తల్లితో విడిచి పెట్టిన పిల్లలకు అభినందనలు! ఇటువంటి నిస్వార్థ స్నేహం ప్రతి ఒక్కరిలోనూ ఉండాలి" అంటూ లలిత రాసి పంపిన కథ ఇది.*



*రచన: కె.లలిత, 9 వ తరగతి, రామచంద్రాపురం, హైదరాబాదు.* *మార్పు చేర్పులు: కొత్తపల్లి*

అడవిని ఆనుకొని ఉన్న ఊళ్లో జంగయ్య అనే రైతు ఉండేవాడు. ఒకసారి కట్టెలు కొట్టేందుకు వెళ్ళినప్పుడు అతనికి పిల్ల ఏనుగు ఒకటి కనిపించింది. తల్లినుండి, గుంపునుండి ఎలా విడిపోయిందో ఏమో గాని, అది సొమ్మసిల్లి పడిపోయి ఉండింది. జంగయ్య దానికి తన దగ్గరున్న నీళ్లను త్రాపి, విసిరి, సేద దీరేట్లు చేసాడు. అయితే దానికి ఇంకా తనంతటి తాను అడవిలోకి వెళ్ళే వయసు లేదు; దాన్ని విడిచి పోయిన ఏనుగుల గుంపు అప్పట్లో అక్కడికి వస్తుందని ఆశా లేదు!

దాంతో 'ఏం చెయ్యాలి?' అని ఆలోచించిన జంగయ్య దాన్ని తనతో పాటు ఇంటికి

తీసుకువచ్చాడు. అప్పటికి జంగయ్య పిల్లలు సుమన్, కవిత ఇద్దరూ చిన్నవాళ్ళు.




వాళ్లు ఆ ఏనుగుగున్నని చూసి మురిసిపోయారు. దానికి అదీ ఇదీ తినిపించటం నుండి, పాలు త్రాగించటం నుండి, స్నానం వగైరాలన్నీ ఆడుకుంటూ చేసారు వాళ్ళు. ఏనుగు గున్న కూడా కొద్ది రోజుల్లోనే వాళ్ళతో ఎంచక్కా కలిసిపోయింది.

ఐతే ఏనుగులు పెంపుడు జంతువులు కాదు. వన్య ప్రాణులు. వాటిని పెంచుకోవటం చట్టరీత్యా నేరం. ఆ సంగతి చెబుతూ జంగయ్య 'దీని ఆరోగ్యం బాగాలేదని కదా, ఇంటికి తెచ్చింది? ఇప్పుడింక దీని ఆరోగ్యం బాగైపోయింది. అందుకని దీన్ని అడవిలో వదిలెయ్యాలి' అంటూ వచ్చాడు. కానీ పిల్లలకు అది ఇష్టం లేదు. వాళ్ళకి దాన్ని తమతోపాటే ఉంచుకోవాలని, తమతోపాటే బడికి తీసుకెళ్ళాలని ఉండింది.

ఒక రోజున వాళ్ళు దాన్ని వెంట బెట్టుకొని బడికి బయలుదేరారు. అది కూడా సంతోషంగా తొండం ఊపుకుంటూ బయలు దేరింది వాళ్ళతోబాటు. పిల్లలు అడవి అంచులకు చేరే సరికి అడవిలో నుండి ఏనుగుల అరుపులు వినిపించాయి. వాటిని వినగానే గున్న ఏనుగు టక్కున నిలబడిపోయి, తొండం ఎత్తి గట్టిగా అరిచి, ఒక్కసారిగా అడవిలోకి పరుగు పెట్టింది. "ఏయ్! గున్నా! ఆగు! ఎటు?!" అంటూ పిల్లలు దాని వెంట పడ్డారు గాని, అది ఆగితేగా? మోటర్ సైకిల్ దూసుకుపోయినట్లు దూసుకు పోయింది.

అది పోయిందని కవిత ఏడవటం మొదలెట్టింది. సుమన్ కొంచెం పెద్ద పిల్లాడు కదా, వాడికి ఏం చేయాలో తోచలేదు. "ఇద్దరం ఇక్కడే కొంచెం సేపు ఆగుదాం. అది వచ్చేస్తుందిలే" అన్నాడు చెల్లెలితో.

ఒక పదిహేను నిముషాల తర్వాత వాళ్ల ముందున్న పొదలు గలగలమన్నాయి. చూస్తే ఒక పెద్ద ఏనుగు! దాని తొండంతో ఆటలాడుకుంటూ గున్న ఏనుగు ఉన్నది. దాని ముఖంలో సంతోషం స్పష్టంగా కనిపిస్తున్నది.



"హేయ్! గున్నా!" అంటూ కవిత దాని దగ్గరికి పరుగు పెట్ట బోయింది కానీ సుమన్ తనని ఆపేసాడు. "చూడు చెల్లెమ్మా! ఆ పెద్ద ఏనుగు ఎవరు? అది మన గున్న వాళ్ల అమ్మ. చాలా రోజులు తప్పిపోయిన గున్న ఇప్పుడే మళ్ళీ వాళ్ల అమ్మని కలిసింది. వాళ్ళిద్దరికీ ఎంత ఆనందంగా ఉందో చూసావా? వాటి సంతోషాన్ని మనం చెడగొట్టకూడదు. నాన్న చెప్పట్లేదా, రోజూ? వాళ్ల అమ్మతో ఉంటేనే మన గున్న సంతోషంగా పెరుగుతుంది. ఇప్పుడు ఇది వాళ్ల అమ్మని కలిసింది కాబట్టి, మనం దాన్ని డిస్టర్బ్ చేయకూడదింక" అని చెప్పాడు.

అన్న మాటను అర్థం చేసుకున్న కవిత ఆగిపోయింది. గున్న కూడా ఒకసారి వాళ్ల దగ్గరికి పరుగెత్తుకొచ్చి, తొండంతో ఇద్దరినీ నిమిరింది.

కొంచెం సేపు అట్లా దూరంగానే నిలబడి వీళ్ళిద్దరినీ చూసాక, పెద్ద ఏనుగు వెనక్కి తిరిగి అడవిలోకి నడవటం మొదలెట్టింది. గున్న ఏనుగు కవిత చెయ్యి పట్టుకొని ఊపి, తల్లి వెంటనే గెంతుకుంటూ వెళ్ళిపోయింది. కళ్లలో నీళ్లతోటే గున్నకు టాటా చెప్పారు పిల్లలిద్దరూ.

**దయ!**

డింగరి : వంద రూపాయల నోటు మీద గాంధీ తాత నవ్వుతూ ఎందుకుంటాడు?

తింగరి: ఏడుస్తుంటే మరి నోటంతా తడయిపోతుంది గదా, అందుకని!






# తల్లిదండ్రుల ప్రేమ

*పెద్దల లోకపు తీరు తెన్నూ పిల్లల మనసుల్ని ఎప్పుడూ స్పృశిస్తూనే ఉంటాయి. వాళ్ల ఆలోచనల్ని ప్రభావితం చేస్తూనే ఉంటాయి. అసమానతలకు క్రుంగే మనసులు, ప్రశ్నించే మనుషులు పుడుతూనే ఉంటారు.. కదా?*

*రచన :చైతన్య, 7 వ తరగతి, క్రాష్ వర్డ్ స్కూల్, గుంటూరు.* *మార్పు చేర్పులు: కొత్తపల్లి*

ధర్మపురంలో చాలా పేద కుటుంబం ఒకటి ఉండేది- భార్య, భర్త వారి ఒక కూతురు. ఆ పాప పేరు స్వాతి. భార్యభర్తలిద్దరూ రోజూ కూలి పనికి వెళ్ళేవాళ్ళు. ఇద్దరూ రెక్కలు విరిగేట్లు పని చేస్తే తప్ప వాళ్లకు పూట గడిచే అవకాశం లేదు. కష్టం చేసే వాళ్ళు, అభిమానవంతులు కావటంతో, రోజుకింత సొమ్ము వెనక వేసుకుంటూ, అప్పులు చేయకుండా సంసారాన్ని గుట్టుగా నడిపించుకొస్తున్నారు.

కూతురి భవిష్యత్తు తమలాగా ఉండకూ-డదని వాళ్ల కోరిక: 'ఆ పాప బాగా చదువు-కోవాలి.. పెద్ద ఉద్యోగం చేయాలి..' అని.

చదువు బాగుండాలనే తపనతో స్వాతిని

వాళ్ళు పట్నంలో పేరున్న ఓ ప్రైవేటు బడిలో చేర్పించారు. స్కూలు బస్సొకటి రోజూ ఊళ్ళోకి వచ్చి, స్వాతి లాంటి పిల్లల్ని కొంత-మందిని మాత్రం బడికి తీసుకెళ్తుంది.

బడిలో మొదటి రోజున టీచరు తనని తాను పరిచయం చేసుకొని, "ఇప్పుడు మీరంతా ఒక్కరొక్కరుగా లేచి నిలబడి, మీ గురించి, మీరు చదివిన పుస్తకాల గురించి, కుటుంబాల గురించి, మీ అమ్మనాన్నలు ఏం చేస్తుంటారు వగైరా వివరాలు చెప్పండి" అని అడిగారు. పిల్లలంతా వరసగా లేచి "మా అమ్మ డాక్టర్, మా నాన్న ఇంజనీర్, మా అమ్మ లాయర్, మా నాన్న సైంటిస్ట్.." ఇట్లా గొప్పగా చెప్పుకుంటున్నారు.

ఇప్పుడు స్వాతి వంతు! "మా అమ్మా-నాన్నలు కూలోళ్ళు" అని చెబితే 'వాళ్లంతా నవ్వుతారేమో!' అని స్వాతికి భయం వేసింది. "అందరూ నవ్వి, ఎగతాళి చేస్తారేమో.. ఇంక నాతోటి స్నేహం చెయ్యరేమో!" అని, ఆ పాప అప్పటికప్పుడు అబద్ధం చెప్పేసింది- "మా అమ్మనాన్నలు ఇద్దరూ అమెరికాలో ఉన్నారు.. నన్నేమో మా ఊళ్ళో ఉంచారు. నన్ను చూసుకునేందుకని ఊళ్ళో ఒక కుటుంబాన్ని చేరదీసారు" అని.

బడిలో పిల్లలంతా అది విని ఆశ్చర్య-పోయారు.

కొందరైతే ముందుకొచ్చి స్వాతిని అభినందించారు. "మీ అమ్మ వాళ్లకు మన దేశం అంటే చాలా ఇష్టమేమో! మన పల్లెల్లోని పేదవాళ్లంటే ఇష్టమేమో" అన్నారు.




ఆ రోజున స్వాతికి 'రమ' అనే పాప పరిచయం అయ్యింది. రమ తల్లిదండ్రులు పట్నంలో వ్యాపారం చేస్తారు. త్వరలోనే రమ, స్వాతి ఇద్దరూ ఫ్రెండ్స్ అయిపోయారు. రమ

స్వాతిని వాళ్ళు ఇంటికి తీసుకెళ్ళి తల్లిదండ్రులకు పరిచయం చేసింది కూడా.

అయితే స్వాతి మటుకు ఆ పాపను తను ఇంటికి పిలవలేదు. 'పిలిస్తే ఎలాగ? తన రహస్యం బయట పడిపోతే ఎలాగ?" అని అందోళన చెందింది.

అందుకనే తన తల్లిదండ్రులకు బడి సంగతులేవీ చెప్పలేదు, రమ గురించీ చెప్పలేదు!

అయితే ఒక సెలవు రోజున రమ బయలుదేరి వచ్చింది, స్వాతి వాళ్ల ఊరికి. ఆ రోజున స్వాతి కూడా ఊళ్ళో పిల్లలతో కలిసి నేరేడు కాయలు ఏరుకునేందుకు వెళ్ళి ఉన్నది. రమ వెతుక్కుంటూ స్వాతి వాళ్ల ఇంటికి వచ్చి, స్వాతివాళ్ల అమ్మని "స్వాతి ఉండేది ఇక్కడేనా?" అని అడిగింది.

"అవునమ్మా! ఇదే, స్వాతి వాళ్ల ఇల్లు. రా, లోపలికి వచ్చి కూర్చో. స్వాతి వచ్చేసరికి ఇంకా గంట-గంటన్నర అవ్వచ్చు" అన్నది స్వాతి వాళ్లమ్మ.

ఇంట్లోకి వచ్చి కూర్చొని అమాయకంగా "స్వాతి వాళ్ల అమ్మానాన్నలు అమెరికాలో ఏం చేస్తుంటారు, ఎప్పుడైనా వస్తుంటారా?" అని అడిగింది రమ. స్వాతివాళ్ళ అమ్మ నవ్వి "నేనే కదమ్మా, వాళ్ల అమ్మని?! మేం ఇక్కడే ఉంటాం. ఎక్కడికి పోతాం? మాకు అవన్నీ ఏం తెలవదు!" అన్నది.



రమ నిర్ఘాంతపోయి "మరి స్వాతి అట్లా చెప్పిందే?!" అంటూ బడిలో జరిగిన విషయం అంతా చెప్పింది.

అంతలోనే స్వాతి వాళ్ల నాన్న కూడా వచ్చాడు. వాళ్ళిద్దరూ బాధని గుండెల్లోనే

దాచుకొని, "చిన్నపిల్ల కదా, నవ్వులాటకి అట్లా అని ఉంటుందమ్మా! తనంతట తానే స్వయంగా ఈ నిజం చెప్పేంత వరకూ మనం కూడా ఇది తనకు చెప్పద్దు. సరేనా, ఈ సంగతి మనకు తెలిసినట్లు స్వాతికి తెలియకూడదు- అసలు నువ్వు మా ఇంటికి వచ్చిన సంగతి కూడా తనకు చెప్పకు!" అన్నారు.

రమ కూడా "సరే అంకుల్! నేను ఇక్కడికి వచ్చినట్లు స్వాతికి గాని, మరే స్నేహితులకు గానీ చెప్పను!" అని వెళ్ళిపోయింది.

***




కొన్ని రోజుల తరువాత స్వాతికి ఒళ్ళంతా కురుపులై, జ్వరం వచ్చింది. డాక్టరు గారు స్వాతి తల్లిదండ్రులతో "ఇది అంటువ్యాధి. ఒకరినుండి ఒకరికి వస్తుంది. తగ్గిపోతుంది లెండి; కానీ ఒక వారం పది రోజుల పాటు ఎవ్వరూ ఆ పాప ఉన్న గదిలోకి కూడా పోవద్దు. లేకపోతే ఆ వ్యాధి మీకు కూడా రావచ్చు" అని చెప్పారు.

"ఇంక నాకు అమ్మ అన్నం కూడా పెట్టదేమో, నాకోసమని ఏ పనులూ చేయదేమో" అనుకొని నీరసపడింది స్వాతి.

కానీ తను అనుకున్నట్లు ఏమీ జరగలేదు.

అమ్మ ఎప్పటిలాగానే ఆ రోజు కూడా అన్నం తీసుకొచ్చి పెట్టింది; స్వాతి విడిచిన బట్టలు ఉతికింది; జుట్టు దువ్వి జడ వేసింది.

"దూరం ఉండమన్నారు కదా డాక్టరు గారు? నాకొచ్చింది అంటు వ్యాధి అట! మళ్ళీ ఈ వ్యాధి నీకు వస్తే ఎలా?" అన్నది స్వాతి

"పర్లేదులే, రాకుండా జాగ్రత్తగానే ఉంటున్నాము. నిన్ను ఒకే చోట ఉంచు-తున్నాం; అంతటా తిరగనివ్వట్లేదు; నీ పనులు చేసాక నేను, నాన్న ఇద్దరం

వేపాకుతో స్నానం చేస్తున్నాము. అయినా రోగం అదీ వస్తే ఏమున్నది, ఓ వారం రోజులు మందులు వేసుకుంటూ దూరం ఉంటాము, రోగం అదే పోతుంది" అన్నది అమ్మ.

"అయ్యో! నాకోసమని వీళ్ళిద్దరూ తమ ఆరోగ్యాల్ని కూడా లెక్క పెట్టరే, ఇట్లాంటి అమ్మనాన్నల గురించి నేనెందుకు, మా బడిలో అబద్ధాలు చెప్పాను? నిజం చెప్పుకో-లేకపోయానెందుకు?" అని ఏడ్చింది స్వాతి.

"ఎందుకు ఏడుస్తున్నావు? ఏడవకు! ఏడిస్తే వ్యాధి మరింత పెరుగుతుంది. ఏడవ కూడదు!" అని మందలించింది అమ్మ.

ఇంక దు:ఖాన్ని ఆపుకోలేని స్వాతి తల్లిదండ్రులకు జరిగిందంతా చెప్పింది.

"ఊరుకో! ఈ విషయం మాకు ముందే తెలుసు. రమ మన ఇంటికి వచ్చి చెప్పింది. పిల్లలందరిముందూ మనం పేదవాళ్లమని చెప్పుకోలేక, అట్లా అన్నావు కదా, ఏం పర్లేదులే!" అని ఓదార్చింది స్వాతి వాళ్ల అమ్మ. స్వాతి బావురుమన్నది.

"అవును. ఇదేం పట్టించుకోకు తల్లీ! ఎవ్వరికీ చెప్పుకోకుండా దాచిన రహస్యాలు, మన లోపల కూడా ఊరికే కూర్చోవు- అవి మన ఆరోగ్యాన్ని తినేస్తాయి. అందుకని ఈలాంటి ఆలోచనలన్నీ వదిలేసెయ్యి. నీ చదువులమీద మనసు పెట్టి, బాగా చదువుకో" అన్నాడు వాళ్ల నాన్న.

ఆ తర్వాత బడికి వెళ్ళిన స్వాతి సమయం చూసుకొని బడిలో తన స్నేహితురాళ్ళందరికీ నిజం చెప్పేసింది. వాళ్లంతా తనని అర్థం చేసుకున్నారు, తప్పిస్తే ఎవ్వరూ ఎగతాళి చేయలేదు. దాంతో ఆ పాప మనసు కూడా తేలికైంది.



**ఎక్కువైన తెలివి!**

జడ్జిగారు : హత్య జరిగిన కత్తి పైన నీ వేలిముద్రలు ఉన్నాయి కాబట్టి నువ్వు నేరస్తుడివి అని నిర్థారిస్తున్నాను.

ముద్దాయి : నేను M.A చదివాను సార్! వేలుముద్రల వాడిని కాదు! మీ తీర్పుని సరిచూసుకోండి!



# ఉడతా ఉడతా నీవెంత?

*సేకరణ, కథనం : జి.అనుదీప్, 6 వ తరగతి,న్యూనల్లకుంట, హైద్రాబాద్*

రామాలయం ప్రాంగణంలో ఉన్న జామ చెట్టెక్కి, పండు కొరికి తింటున్నది చిన్నారి ఉడుత.

ఆ రోజున శాస్త్రి గారి ప్రవచనంలో తన పేరు వినిపించింది దానికి! దాంతో చెట్టు దిగి, శాస్త్రిగారి దగ్గరికి వెళ్ళి నిలబడి మరీ విన్నది:

"శ్రీరాములవారికి వారధి నిర్మాణంలో సాయం చేసింది ఒక్క వానరులే కాదు! వాళ్లకంటే చిన్న జంతువు- ఉడుత కూడా ఆ మహత్కార్యంలో తన వంతు సాయం చేసిందిట!

అందుకు రాములవారు సంతోషించి, ఉడుతను దగ్గరకు తీసుకొని, దాని వీపును ప్రేమగా నిమిరాడట! దానికి గుర్తుగానే ఉడుత వీపు మీద చారలు ఉంటాయట" అని శాస్త్రి గారు చెబుతుంటే శ్రోతలతో పాటు ఈ ఉడుత కూడా శ్రద్ధగా విన్నది.

"ఏంటీ! నా వీపు మీద ఉన్న గీతలు ఒట్టి గీతలు కాదా?! రామయ్య వ్రేళ్ల గుర్తులా ఇవి! ఆహా! నేనెంత గొప్పదాన్ని?! నా గురించి

నాకు తెలీకుండా ఇట్లా పెరిగానే?! ఇప్పుడు చెబుతాను!" అనే ఆలోచన మనసులోనే తిరిగి ఎక్కడలేని సంతోషం వేసింది దానికి. చెప్పలేనంత గర్వంతో ఇక ఆగలేక పల్టీలు కొట్టి, ఆనందంగా అడవిలోకి పరుగెత్తింది.

అట్లా ఉబ్బి తబ్బిబ్బైపోతూ పోతున్న ఉడుతకు దాని ఫ్రెండ్స్ ఎలుక, తాబేలు ఎదురయ్యాయి.



వాటిని చూస్తే ఉడుతకు మామూలుగానైతే చాలా సంతోషంగా ఉండేది. కానీ ఇవాళ్ల ఎందుకో, అవి రెండూ ఒట్టి పనికిమాలినవి అనిపించాయి. వాటిని చూసి కూడా చూడనట్టే పోబుద్ధయింది ఉడుతకి.

అది అట్లా పైకి పైకి చూసుకుంటూ ఎగిరి గంతులు వేసుకుంటూ వెళ్తుంటే ఎలుక, తాబేలు కూడా దాని వెంట పరుగుపెడుతూ "ఆడుకుందామారా?" అని అడిగాయి అనురాగంతో.

"నేనా?! మీతో ఆడాలా?! అసలు మీకు తెలుసా నా చరిత్ర ఏంటో? నా వీపుపైన ఉన్న ఈ చారలు ఎలాంటివో తెలుసా మీకు? ఇవి మామూలు చారలు కాదు! రామయ్య తండ్రి వేళ్ళ గుర్తులివి! నాతో ఆడేందుకు మీరేంటి, మీకున్న విలువేంటి?! పోండి, పోండి!" అని ఈసడించుకుంటూ ముందుకు సాగింది ఉడుత.

అంతలో ఎదురుగా కనిపించాడు గున్నేనుగన్నయ్య. "ఏయ్! నీ ఫ్రెండ్స్ ఏరీ, ఆడుకోవడం లేదా?" అన్నాడు.

"లేదు లేదు" అంటూ రాగం తీసి, "ఆ విలువ లేనోళ్ళతో ఆడనన్నాను" అంది ఉడుత.

"అయ్యో! అదేమి? విలువ లేదంటావేమిటి?

వాళ్ళు మంచోళ్ళేనే? రోజూ నీతోటి ఆడుకుంటుంటారు కదా?"

"నిజమే. ఇప్పుడు నన్నే తీసుకోండి. నా వీపున చారలున్నై. ఇవి ఎలా వచ్చినై? రాముల వారు.. "అంటూ తను విన్నదంతా చెప్పుకున్నది ఉడుత.



అంతా విని ఆగకుండా నవ్వింది గున్న ఏనుగు. "ఎందుకు, నవ్వుతున్నావు?" అని అడిగింది ఉడుత, కోపంతో .

"అయ్యో, ఉడతా, నీ అమాయకత్వానికి నవ్వుతున్నాను! నీ చారలు చూసుకొనే నువ్వు ఎగిరి ఎగిరి పడుతున్నావే, మరి ఇంక ఎలుక ఎంత గర్వపడాలి, ఆ ఎలుక అసలు వినాయకుడి వాహనం కదా?! మరి ఇంక తాబేలు సంగతికొస్తే, విష్ణుమూర్తే స్వయంగా దాని అవతారం ఎత్తాడు గదా?! అసలు ఇప్పుడు ఆ ఎలుక, తాబేలే 'నీతో స్నేహం చెయ్యం పో!' అప్పుడు నీ పరిస్థితి ఏంటి, చెప్పు?!

నిజంగా మనస్ఫూర్తిగా చెబుతాను తల్లీ, నువ్వు వాటి 'మంచితనాన్నే' 'చేతకానితనం' అనుకున్నావు. అందుకే మంచి నేస్తాలను వదులుకున్నావు- అంతకు మించి ఏమీ లేదు" అంటూ ముందుకు సాగింది ఏనుగు.

దాని మాటలు వినగానే ఉడుత తలకెక్కిన గర్వమంతా టప్పుమని ఎగిరిపోయింది.

సృష్టిలోని ప్రతి జీవికీ దానిదైన గొప్పతనం ఉందని అర్థమై, తన నేస్తాలకు క్షమాపణ చెప్పేందుకు వెనక్కు తిరిగిందది.

అమ్మ: ఫెవికాల్ ట్యూబ్ ఏదంటే మీ నాన్న నోరు విప్పట్లేదేంరా రవీ?

రవి: పొద్దున్నే నన్ను టూత్ పేస్ట్ అడిగారమ్మా. నేను ఫెవికాల్ తెచ్చిచ్చాననుకుంటా!





# ఓరెంకారేవడ్సాకాదిస్కే!

రచన :మహేంద్ర, డిగ్రీ మొదటిసంవత్సరం, నాగసముద్రం, అనంతపురంజిల్లా.

అనగనగా నాగసముద్రంలో గంగరాజు అనే నేతగాడు ఒకడు ఉండేవాడు. అతనికి లేకలేక ఒక కుమార్తె పుట్టింది. ఆమె పేరు రాణి.

రాణిని చాలా ముద్దుగా పెంచుకున్నారు గంగరాజు దంపతులు. ఆ పాపమీద బాగా ఆశలు కూడా పెట్టుకున్నారు. ఆ పాప కూడా పెరిగి పెద్దయ్యే కొద్దీ చేనేత విద్యలో మంచి నిపుణతే సాధించింది.

గంగరాజు నోరు ఊరికే ఉండదు. ఎప్పుడూ మాట్లాడుతూనే ఉండాలి. ఒట్టి కోతల-రాయుడు కూడా. ఉన్న విషయాన్ని ఉలవలు పలవలుగా పెంచి, అసలు కంటే ఎన్నో రెట్లు ఎక్కువ చేసి చెప్పటం అతనికి అలవాటు. 'అనవసరమైన మాటలే కొంప ముంచు-తాయి' అని ఏమాత్రం తెలీదు అతనికి.

ఒకరోజు అతను వాళ్ళ బంధువు లింగరాజుతో మాట్లాడుతూ "మా రాణి చెయ్యి మామూలు చెయ్యి కాదురా! ఆ పాప డోలు చుడుతుంటే, అందులో వేసిన గడ్డి పరకలు కూడా బంగారు కడ్డీలుగా మారిపోతాయి!" అనేసాడు.



ఆ మాట వారి నోటా వీరి నోటా పడి నలిగి, చివరికి ఆ దేశపు రాజు చెవిలో పడింది. ఇంకేముంది?- "వెళ్ళి అమెను తక్షణం వెంట బెట్టుకు రండి" అని భటుల్ని పంపించారు రాజుగారు. భటులు రాణిని వెతుక్కుంటూ నాగసముద్రం వరకూ వచ్చి, "లింగరాజు ఇల్లు ఎక్కడ?" అని వాకబు చేసారు. 'సంగతేంటి?' అని కుతూహలపడ్డ ఊళ్ళోవాళ్ళు, వాళ్ల వెంట వచ్చి మరీ లింగరాజు ఇల్లు చూపించారు.

"రాజుగారు నిన్ను వెంట బెట్టుకు రమ్మన్నారు తల్లీ" అని చెప్పారు భటులు. ఇక రాణికి వాళ్ల వెంట రాక తప్పలేదు. రాజుగారి దర్బారుకు వెళ్ళి నిలబడింది. రాజుగారు ఆ అమ్మాయిని చూడగానే మర్యాదగా లేచి నిలబడి, "నువ్వు డోలు చుడుతుంటే అందులో గడ్డి పరకలు వేసినా కూడా బంగారు కడ్డీలు అవుతాయట కదా! మన దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉంది. ఖజనాలో నిధి బాగా తగ్గిపోయింది. నువ్వు ఇప్పుడు ఎలాగో ఒకలాగా నిధిని పెంచాలి- ఎంత కష్టమైనా సరే, తప్పదు" అని చెప్పేసాడు.

"అయ్యో రాజావారూ, దయచేసి నామాట ఆలకించండి. నాకు ఇవేవీ రావు. మా నాన్న వట్టి కోతలరాయుడు. గొప్పలు చెప్పుకోనిదే బ్రతక లేడు!" అని నిజం చెప్పింది రాణి.

అయినా రాజుగారు ఆమె మాటలు నమ్మలేదు. "చూడమ్మా! పరాచికాలకు ఇది సమయం కాదు. దేశం ఎట్లా ఉందో చెప్పాను నీకు! చేతిలోని విద్యల్ని దేశం కోసం కాకపోతే ఇంక దేనికి వాడతావు? నువ్వు ఖజానాలో సంపదని పెంచాల్సిందే. వేరే మాట లేదు!" అని, రాజుగారు ఆమెకు సకల సౌకర్యాలూ కల్పించాడు; సేవలు చేసేందుకు చెలికత్తెల్ని పెట్టాడు; కడుపునిండా ఫలహారాలు సమకూర్చాడు. ఆమె ఉండే గదిలో ఒక డోలు, గది నిండా గడ్డి సమకూర్చాడు!

రాణికి ఇంక ఏమి చేయాలో తెలీలేదు. పగలంతా కూర్చొని తండ్రిని బాగా తిట్టుకుంది. రాత్రంతా ఆ గడ్డి కుప్ప ముందు కూర్చొని ఏడ్చింది. చివరికి ఇంక తట్టుకోలేక, 'చనిపోవాల్సిందే' అనుకున్నది. 'ఈ గడ్డితోటే ఉరి వేసుకుంటాను' అని నిశ్చయించుకున్నది.

అయితే సరిగ్గా అదే సమయానికి ఆమె ఉన్న గదిలోకి దూకింది, ఒక భూతం! రాణి దాన్ని చూసి కూడా చూడనట్లే ఉంది. అది రాణిని చూసి భయంకరంగా పళ్ళన్నీ కనబడేట్లు ఇకిలించింది. జవాబుగా రాణి మూతి ముడుచుకున్నది. భూతం ఓ చర్నాకోల తీసుకొని గడ్డినంతా చెల్లాచెదరయ్యేట్లు కొట్టింది. దాన్ని కళ్ళార్పకుండా చూసిన రాణి, "గడ్డిని కొడితే ఏమొస్తుంది, నన్ను చంపెయ్యి మామయ్యా! కనీసం ఈ పీడన్నా విరగడౌతుంది" అని ఏడ్చింది.

ఆశ్చర్యపోయిన భూతం గడ్డిని ఏకే పనిని ఆపి "ఏమైంది? ఏడవాల్సినంత విషయం ఏం జరిగింది?" అని అడిగింది. జరిగిన సంగతంతా పూస గుచ్చినట్లు చెప్పి, ఇంకోసారి కళ్ళనీళ్ళు పెట్టుకున్నది రాణి.

"సరే సరే, అర్థమైంది! ఇప్పుడింక మళ్ళీ ఏడవకు, ఊరికే. నేను నీకు సాయం చేస్తాను!" అని, రాణినే పరీక్షగా చూస్తూ "ముందు నీ కాళ్ళకు వున్న బంగారు పట్టీలు తీసి ఇవ్వు" అన్నది భూతం.

రాణి తన కాళ్ళకు ఉన్న పట్టీలు తీసి భూతానికి ఇచ్చింది. భూతం వాటిని గడ్డిలో వేసి చేతులు తిప్పింది. వెంటనే అక్కడున్న

గడ్డి పరకలన్నీ బంగారు కడ్డీలుగా మారాయి. ఆ వెంటనే భూతం కూడా మాయమైపోయింది.

తెల్లవారగానే రాజుగారు వచ్చి, బంగారంగా మారిన గడ్డిని చూసి చాలా సంతోషించాడు. "నాకు తెలుసు తల్లీ! నువ్వు కోరుకుంటే ఏమైనా చేయగలవు! నీవల్ల మన ఖజానాలో మూడో వంతు నిండి పోయింది! ఇంక మన పెద్దలు చేసిన బాకీలు తీరినట్లే. ఇవాళ్టిరోజున కొంచెం శ్రమ పడ్డావంటే మనం చేసిన బాకీలు కూడా తీరిపోతాయి. ఇలా అడుగుతు-న్నానని ఏమీ అనుకోకు- మళ్ళీ గదినిండా గడ్డి వేయిస్తాను" అన్నాడు.

"నాకేమీ రాదు! ఇది నేను చేసింది కాదు!" అని రాణి ఏదో చెప్పబోయింది గానీ ఆయన వినలేదు! గదిలో ఒక్క బంగారు కడ్డీ కూడా లేకుండా ఎత్తుకెళ్ళి, కొత్త గడ్డి తెచ్చి వేయించాడు మళ్ళీ.

రెండవరోజున కూడా ఏడ్చుకుంటూ కూర్చున్నది రాణి. "భూతం మామయ్య వస్తే బాగుండు!" అనుకున్నది గానీ, "రోజూ రావాలని ఏమున్నది?" అని కూడా అనుకున్నది. అయితే ఆమె అదృష్టం కొద్దీ మళ్ళీ వచ్చింది భూతం. "నాకు తెలుసు; నీ పరిస్థితి ఇట్లా అవుతుందని. ఏదీ, బంగారం ఇవ్వు. అంటూ రాణి వేసుకున్న బంగారు గొలుసును తీసుకొని, అక్కడున్న గడ్డినంతా ఒక్క క్షణంలోనే బంగారు కడ్డీలుగా మార్చేసి, వెళ్ళిపోయింది.

తెల్లవారాక వచ్చి చూసిన రాజుగారు, బంగారాన్నంతా ఖజానాకు తరలించి, ఆమెను చాలా మెచ్చుకొని, "అమ్మా, నీ చలవ వల్ల నా ఖజానా రెండు వంతులు నిండిపోయింది. మన బాకీ అంతా తీరినట్లే. ఇప్పుడు ఇంక ఒక్క రోజు శ్రమ పడ్డావంటే, ఇక మన తర్వాతి తరం అంతా దర్జాగా పెరుగుతుంది!" అన్నాడు, కొత్తగా గడ్డి తెచ్చి వేయిస్తూ.

ఆ రోజు రాత్రి కూడా భూతం మామయ్య కోసం ఎదురు చూస్తూ కూర్చున్నది రాణి. అనుకున్నట్టు గానే భూతం వచ్చింది. అది రాగానే "మార్చేయి, మామయ్యా;

మార్చేయి గబగబా!" అన్నది రాణి.

"సరే, ఏదైనా బంగారు నగ ఇవ్వు మరి-" అని చేతులు చాపింది భూతం. కానీ రాణి దగ్గర ఇచ్చేందుకు ఇంక ఏ బంగారు నగా లేదు. కాళ్ల పట్టీలు, మెడలో గొలుసు రెండూ ఇచ్చేసిందిగా?!

"అయ్యో! నా దగ్గర ఇంక బంగారం ఏమీ లేదే!" అంది రాణి.

"బంగారం లేకపోతే మరి ఇంక నేనేమీ చెయ్యలేను!" అంది భూతం.

రాణి భూతాన్ని చాలా బ్రతిమిలాడేసరికి, చివరికి అది రాణితో ఒక మాట తీసుకుంది: "నేను ఇప్పుడు ఈ గడ్డిని బంగారు చేస్తాను. రేప్పొద్దున రాజు వచ్చి, నిన్ను తన కొడుక్కు ఇచ్చి పెళ్ళి చేస్తాడు. ఆ తర్వాత మీకు ఒక కుమారుడు జన్మిస్తాడు. వాడికి ఐదేళ్ళు రాగానే వాడిని నాకు ఇచ్చెయ్యాలి" అని.

అంతా భూతం చెప్పినట్లే జరిగింది. రాజుగారు రాణిని తన కోడలుగా చేసుకున్నాడు. భూతం భయం కొద్దీ రాణి "ఇవేవీ వద్దు. నేను మా ఊరికి వెళ్ళిపోతాను" అన్నది గానీ, రాజుగారు ఆమె మాటల్ని అస్సలు వినలేదు.

చూస్తూండగానే రాణికి ఒక కొడుకు పుట్టాడు; వాడికి నాలుగేళ్ళు నిండి ఐదో ఏడాది పడే సరికి భూతం వచ్చి కనిపించింది రాణికి: "గుర్తుందిగా, ఈ ఏడాది గడిచే సరికి నీ కొడుకుని నాకు ఇచ్చేయాలి. ఈ ఏడాదంతా నేను కూడా మీ ఇంట్లోనే ఓ గదిలో నివసిస్తా" అంటూ.

రాణి దు:ఖంతో బక్కచిక్కిపోసాగింది. "నీలో ఏదో మార్పు ఉంది- ఏమైంది?" అని యువరాజు ఎంత అడిగినా ఆమె మటుకు ఏమీ చెప్పుకోలేదు.

అయితే యువరాజు కూడా చాలా మంచివాడు; అతను గంగరాజుతో "మామా! రాణి ఎందుకో చాలా బాధ పడుతున్నది. నువ్వైతే ఆమెను అర్థం చేసుకుంటావు. వచ్చి కొన్నాళ్ళు మాతోనే ఉండు" అని చెప్పి పిలిపించాడు.

గంగరాజు రాణిని మాటల్లో పెట్టి అసలు సంగతిని రాబట్టాడు. "తల్లీ! ఇదంతా నా తప్పు వల్లే జరిగింది కాబట్టి, దీని పరిష్కారం కూడా నేనే చూపిస్తాను. నువ్వు కంగారు పడకు" అని, ఆనాటి నుండి రోజూ భూతం ఉండే గదిలోకి వెళ్ళి దానితో ముచ్చట్లు పెట్టుకోవటం మొదలు పెట్టాడు.



గంగరాజు చెప్పే జోకులు, సామెతలు భూతానికి చాలా ఇష్టం అయ్యాయి. అతను అడిగే పొడుపు కథలు విప్పటంలో దానికి ప్రత్యేకంగా మజా వచ్చేది. ఒక్కోసారి గంగరాజు దానితో చిన్న చిన్న పందేలు కూడా వేసేవాడు. "అడవిలో పుట్టింది-అడవిలో పెరిగింది.."అని ఓ పొడుపు కథ అడిగి, "సమాధానం చెబితే నీకు ఒక చాక్లెట్ ఇస్తా" అనేవాడు. భూతానికి అట్లాంటి పందేలు కూడా చాల నచ్చినై.

ఒకరోజున భూతం గంగరాజుకి ఒక సమస్యను ఇచ్చి పరిష్కరించమన్నది- "ఓరెంకారేవడ్సాకాదిస్కే అంటే ఏంటి?" అని. "నాకు తెలీదు- నువ్వే చెప్పెయ్యి" అన్నాడు గంగరాజు. "కాదు కాదు. నువ్వే చెప్పాలి" అన్నది భూతం. "లేదులే, నేను ఓడిపోయాను" అన్నాడు గంగరాజు. "కాదు కాదు! కనుక్కో! కనుక్కుంటే మంచి బహుమతి ఏదైనా ఇస్తాను" అంది భూతం.

"ఏమిస్తావు?" అడిగాడు గంగరాజు ఉత్సాహంగా.

"ఇది చాలా పెద్ద పందెమే మరి. నీకు వారం రోజులు సమయం ఇస్తాను. సరైన సమాధానం చెప్పావంటే, నేను నీ బిడ్డ రాణిని, మనవడిని వదిలిపెట్టి ఇక కనబడకుండా వెళ్ళిపోతాను. చూడు మరి!" అన్నది భూతం మెరిసే కళ్లతో.

"సరే" అని గంగరాజు ఆ సమస్యని రాణికి, యువరాజుకు నివేదించాడు. వాళ్ళు మంత్రుల్ని అడిగారు. మంత్రులు తమకు తెలిసిన పండితుల్ని అడిగారు- ఎవ్వరికీ అసలు ఈ ప్రశ్న ఏంటో, ఏ భాషలోదో, ఏమీ అంతు చిక్కలేదు.

ఆ సరికి ఐదు రోజులు గడిచాయి. గంగరాజు రాజ్యంలో అంతటా తిరగటం మొదలెట్టాడు. పండితులు-పామరులు అనకుండా ఎవరు కనిపిస్తే వాళ్లని "ఓరెంకారేవడ్సాకాదిస్కే" అంటే ఏంటి?" అని అడగటం మొదలెట్టాడు.

ఆ రోజున కూడా అతను వెతికి వెతికి అలసి పోయి, ఓ నది ఒడ్డున ఉన్న మర్రి చెట్టు కింద కూలబడ్డాడు.

అక్కడికి దగ్గర్లోనే ఒక ఊరు ఉంది. ఆ ఊళ్లో ఉండే ఒక సెట్టిగారికి నది అవతలగా ఐదు ఎకరాల పొలం ఉంది.

సెట్టి గారి దగ్గర ఒక పాలేరు ఉండేవాడు. అతని పేరు వెంకన్న.

సెట్టిగారు రోజూ పొలానికి వెళ్తూ వెంకన్నను వెంటబెట్టుకొని వెళ్ళేవాడు. నదిలో ఒక్కోసారి నీళ్ళ ప్రవాహం ఎక్కువ ఉండేది; ఒక్కోసారి నది నడచుకొని దాటేందుకు వీలుగా ఉండేది- ఏ రోజున నది ఎలా ఉందో పరీక్షించటం వెంకన్న పని.

ఆ రోజున మొదటగా వెంకన్న నదిలోకి దిగి కొంత దూరం నడిచాడు.



ప్రతిరోజూ మాదిరే గట్టు మీదినుండి సెట్టిగారు "ఓరెంకా! రేవడ్సా?" అని అడిగాడు గట్టిగా. "ఓరీ వెంకా! రేవు అడుసా?- ఒరే వెంకన్నా, రేవు బురద

బురదగా ఉందా?" అని దాని అర్థం.

"కాదిస్కే!" అని అరిచాడు వెంకన్న. "కాదు ఇసకగానే ఉంది, బురదగా లేదు" అని!

చెట్టు క్రింద కూర్చున్న గంగరాజుకు ఆ క్షణంలో మొత్తం అర్థమైపోయింది: గతంలో భూతం ఈ మర్రిచెట్టు మీదే ఉండి ఉంటుంది! రోజూ శెట్టిగారు, వెంకన్న ఇలా మాట్లాడుకోవటం గమనించి ఉంటుంది. కానీ దానికి ఇదేమీ అర్థమై ఉండదు!! అందుకే ఇప్పుడు అది తనకు ఈ సమస్య ఇచ్చింది!

గంగరాజు తక్షణం రాజధానికి వెళ్ళి, తను కనుగొన్న రహస్యాన్ని వివరించి చెప్పేసాడు భూతానికి .

భూతం గట్టిగా నవ్వి, తను ఇచ్చిన మాట ప్రకారం రాణిని, ఆమె కొడుకుని వదిలిపెట్టి ఇక కనబడకుండా వెళ్ళిపోయింది.

"ఎక్కించి చెప్పి అనవసరంగా నా బిడ్డను కష్టాలపాలు చేసానే!" అని బాధపడే గంగరాజు మనసు ఇప్పుడు చల్లబడింది.

యువరాజుకు భార్య అంటే గౌరవం పెరిగింది. అటుపైన అందరూ సుఖంగా ఉన్నారు.



**పొడుపు కథలు**

1. ఎముక లేనిది, నిచ్చెన ఎక్కేది
2. ఊళ్ళో లేని మండలం, చేతిలోని మండలం
3. ఊరంతా ఒకటే పందిరి!
4. ఏడవక ఏడ్చును, నవ్వక నవ్వును. ఎవరు?
5. ఒక పోలీసు, రెండు టోపీలు. ఏంటది?
6. ఇల్లంతా వెలుగు, బల్ల క్రింద చీకటి
7. ఒక ఇంటికి రెండు దారులు!
8. ఏ రాయీ వద్దన్నా ఆ రాయి కావాలి అందరికీ!
9. ఏడిస్తే ఏడుస్తుంది, నవ్వితే నవ్వుతుంది!
10. కన్నులున్న చిన్నది, కడలియందు జీవించు!

1. పేను 2. కమండలం 3. ఆకాశం 4. నటుడు 5. బఠానీ గింజ
6. దీపం 7. ముక్కు 8. ఉప్పురాయి 9. అద్దం 10. చేప

*-సేకరణ: డా.పత్తిపాక మోహన్, "పిల్లలకోసం పొడుపు కథలు"*




# మనది కానిది మనకెందుకు?

*తెలుగులో పలు మాండలీకాలున్నాయి. ఈ హాస్య కథలోని మాండలికం రాయలసీమది. దీనిలో వాడిన పదాలకున్న మరో ప్రత్యేకతని గుర్తించారా? ఒక అక్షరానికి మరో అక్షరం వత్తు పెడితే 'సంయుక్తాక్షరం' అవుతుంది. ఈ కథలో ఎక్కడా ఒక్క సంయుక్తాక్షరమూ లేదు!*

*రచన : డా. ఎం.హరికిషన్, కర్నూలు.*

ఒక ఊరిలో రాజయ్య అని ఒక కట్టెలు కొట్టేవాడు వుండేటోడు. వాడు రోజూ అడవికి పోయి ఆ రోజుకు సరిపడా కట్టెలు కొట్టుకోని అమ్మేవాడు. ఎక్కువగా ఆశ పడేవాడు గాదు. ఉన్న దానిలో తిని, హాయిగా కాలం గడిపేవాడు.

ఒక రోజు వాడు అడవిలో పోతావుంటే, దారిలో ఒక చోట ఒక బంగారు వరహా కనబడింది. దానిని తీసుకొని చుట్టూ చూసినాడు.. ఎవరూ కనబళ్ళేదు.

కొంచెం దూరం పోయేసరికి మరో వరహా కనబడింది వాడికి! ఇంకొంచెం దూరం పోయేసరికి ఇంకో వరహా! అలా ఒకదాని తరువాత ఇంకొకటి!!

కాసేపటికి వాడి చేతులు రెండూ వరహాలతో నిండిపోయినాయి. కానీ వరహాలు మాత్రం ఇంకా కనిపిస్తానే ఉన్నాయి.



"పాపం! ఎవరో పారేసుకున్నట్టున్నారు. వీటిని తీసుకు పోయి రాజభటులకు చూపిద్దాం. వాళ్ళొచ్చి, మిగతావి కూడా వెతికి పట్టుకొని, సొంతదారులు ఎవరో కనుక్కొని అప్పజెబుతారు" అనుకుంటా తిరిగి వెనక్కు బైలుదేరినాడు రాజయ్య.

రాజయ్య ఇంటి పక్కనే ధనయ్య అని ఒకడు వున్నాడు. ఊరిలో వానంత ధనవంతుడు ఎవడూ వుండడు. వాడు పెద్ద ఆశపోతు. ఎంత సంపాదించినా "ఇంకా కావాల,ఇంకా" అని అల్లాడి పోతా వుంటాడు.

ఆరోజున వాడు ఇంటి బైట కూచోని, ఎప్పుడూ గాడిద మీద కట్టెలు వేసుకోని వచ్చే రాజయ్య వుత్త చేతులు వూపుకుంటా రావడం చూసినాడు. "పాపం.. ఈ రోజు కట్టెలు దొరకలేదేమో" అనుకున్నాడు- గాని రాజయ్య మొగం ఏదో గాబరాగా వుంది.

అది చూసి, 'ఏదో జరిగింది' అనుకోని, దగ్గరికి పోయి "ఏం రాజయ్యా, కట్టెలు దొరకలేదా, ఎందుకలా కంగారు పడతా వున్నావు?" అన్నాడు.

రాజయ్య వానికి జరిగిందంతా చెప్పినాడు.

"నిజమా... ఇంకా వరహాలు వున్నాయా, అక్కడ?" అన్నాడు ధనయ్య అశగా.

'వున్నాయం'టూ తలూపినాడు రాజయ్య.

"సరే ఒక పని చెయ్యి. మన పల్లెలో రాజభటులు ఎక్కడ వుంటారు?! నేనే సాయంగా అవన్నీ ఏరుకోని పోయి, మన నగరాన్ని పాలించే రాజుకు అప్పజెబుతాలే. నువ్వు హాయిగా నీపని చూసుకో!"అని

నమ్మకంగా చెప్పేసినాడు ధనయ్య.

రాజయ్య చానా అమాయకుడు. ఎవురిని పడితే వాళ్లని నమ్ముతాడంతే. అందుకని ఆ ధనయ్య మాటలు నమ్మేసి, తన చేతిలోని వరహాలు గూడా వానికే ఇచ్చి, "ఇవి గూడా తీసుకోని పోయి రాజుకు అప్పజెప్పు ధనయ్యా, ఒకని సొమ్ము మనకెందుకు?!" అనేసినాడు.

ధనయ్య లోపల్లోపల సంబరంగా నవ్వుకుంటా అవి తీసుకున్నాడు. వెంటనే బిరబిరా ఇంటిలోనికి పోయి, రెండు గోనె సంచులు గాడిదమీద వేసుకోని, రాజయ్య చెప్పిన వైపు వురుకులు పరుగులు మీద పోయినాడు.

రాజయ్య చెప్పిన చోటుకి చేరుకునే సరికి బంగారు వరహాలు కనబన్నాయి. సంబరంతో ఎగిరి గంతులు వేసినాడు. గాడిదను వేగంగా తోలుకుంటా పోతా ఒక్కొక్క వరహా ఏరుకో సాగినాడు.

నెమ్మదిగా ఒక గోనెసంచీ నిండిపోయింది. వరహాలు చానా బరువు వుంటాయి గదా, దాంతో గాడిద మోయలేకపోతోంది. ఐనా ధనయ్య ఆశ అగడం లేదు. ఇంకా దారి వెంబడి వరహాలు కనబతానే వున్నాయి. సాయంకాలానికి రెండు సంచులూ నిండిపోయినాయి.



ఇంక చీకటి పడతా వుంది. ఆ అడవిలో దొంగలు చానా ఎక్కువ. వాళ్ల చేతికి చిక్కితే కష్టమే. అందుకని ధనయ్య మెల్లగా వెనక్కి తిరిగి ఇంటికి బైలుదేరినాడు. గాడిద ఆ బరువును మోయలేక, అడుగు తీసి అడుగు వేయసాగింది. ఇలాగే నత్తలాగా నెమ్మదిగా పోయారంటే చీకటి పడి, దొంగలకు దొరికిపోవడం ఖాయం!

దాంతో ఎదారిపడిన ధనయ్య ఒక మూటని తనే ఎత్తుకుని పోదామని చూసినాడు. కానీ

పని చేయక చానా రోజులైంది కదా, అందుకని నాలుగు అడుగులు వేసేసరికే చుక్కలు కనబన్నాయి. దాంతో తిరిగి మూటలు రెండూ గాడిద వీపుమీదే వేసినాడు. "ఏం చేద్దామా?" అని ఆలోచించ సాగినాడు.

ఊరికి తొందరగా చేరుకొనేకి ఒక అడ్డదారి వుంది. ఆ దారిన పోతే సగం దూరం తగ్గుతుంది. కానీ ఆ తోవలో చిన్న వాగు ఒకటి అడ్డం వుంది. వాగులో ఎక్కడ ఏ గుంత వుంటాదో, ఎక్కడ ఏ పెద్ద రాయి తగులుతాదో ఎవరికీ తెలీదు. అందుకే ఎవరూ అటువైపు రారు.

కానీ ఆశపోతు ధనయ్య ఆ వాగువైపే బైలు దేరినాడు. కాసేపటికి అక్కడికి చేరుకోని నెమ్మదిగా గాడిదతో సహా వాగులోకి దిగినాడు. నీళ్ళు వేగంగా పారతా వున్నాయి. గాడిద అప్పటికే బాగా అలసి పోయివుంది. దానికి చేతగావడం లేదు. అడుగులు తడబడతా వున్నాయి. అంతలో దాని కాలు చిన్న గోతిలో పడింది. అంతే! దభీమని కింద పడిపోయింది. దాని వీపు మీదున్న రెండు మూటలూ జారి పోయినాయి. వాటిలోని నాణాలన్నీ నీళ్ళలో పడి చెల్లాచెదురై పోయినాయి. ధనయ్య అదిరిపన్నాడు. నీళ్ళల్లో కిందా మీదా పడతా వెదకసాగినాడు. కొట్టుకు పోయినవి కొట్టుకు పోగా అక్కడొకటి ఇక్కడొకటి దొరకసాగినాయి వరహాలు. వాటిని ఏరుకుంటా వుండగానే వెనుక చప్పుడయింది. తిరిగి చూసినాడు: పెద్ద దొంగలగుంపు- చేతుల్లో కత్తులతో. అదిరిపన్నాడు. "దొరికితే ఇంగేమన్నా వుందా, అంతే సంగతులు!" అనుకొని, ఆ నీళ్ళల్లోనే వేగంగా ముందుకు వురకసాగినాడు. అలా వురుకుతా వుంటే నడుమ ఒక పెద్ద గొయ్యి అడ్డం వచ్చింది. చూసుకోక అందులో కాలు పెట్టినాడు. అంతే కాలు కలుక్కుమనింది. దభీమని పడిపోయినాడు. "అబ్బా!" అంటూ ముక్కుతా మూలుగుతా పైకి లేచినాడు. అంతలో దొంగలు వచ్చి వాన్ని చుట్టుకున్నారు-

"ఏరా మానుంచే తప్పించుకోని పారిపోదామని అనుకుంటున్నావా" అంటా తలా నాలుగు పీకినారు. చేతిలోని బంగారు వరహాలన్నీ గుంజుకున్నారు. వాటితో పాటు ధనయ్య మెడలో గొలుసు, వేళ్ళ వుంగరాలు, చేతి కంకణం, బంగారు మొలతాడు- అన్నీ ఒలుచుకోని పోయినారు.



"అయ్యో! చేతికి చిక్కిన వరహాలూ పాయ, ఒంటిమీదున్న బంగారమూ పాయ!" అని బాధతో లబోదిబోమన్నాడు ధనయ్య.

అయినా వానికి ఆశ చావలా. బుద్ధిరాలా. వుత్త చేతులతో ఇంటికి పోవాలనిపించలా. అక్కడే ఒక చెట్టుచాటున పడుకోని నిదురపోయినాడు.

తరువాతి రోజు పొద్దున్నే- ఇంకా తెలవారక ముందే లేచి, కుంటుకుంటా కుంటుకుంటా మళ్ళీ వరహాలు దొరికిన చోటికి పోయినాడు. ఇంకా అక్కడ దారంతా వరహాలు పడున్నాయి.

"హమ్మయ్య! ఆ పాతవన్నీ పోతే పోయినాయిలే. ఇక్కడ ఇంకా చాలా వున్నాయి. ఈసారి తొందరగా ఏరుకోని పోతాను. చీకటి పడేలోగా ఇంటికి చేరుకుంటాను" అనుకుంటా బిరబిరా ఏరుకోసాగినాడు.

నిజానికి ఆ వరహాలన్నీ ఆ వూరి రాజుగారివే. ఆ ముందురోజు వరకూ చుట్టు పక్కల దేశాలనుంచి, సామంతుల నుంచి వసూలు చేసుకున్న కప్పమంతా ఒక పెద్ద గుర్రంబండిలో వేసుకోని రాజుగారి ఖజానాకు తీసుకోని పోతా ఉండినారు సైనికులు . అయితే ఆ బండికింద చిన్న బొక్క పడింది. దారి వెంబడంతా ఒక్కొక్కటే వరహా జారి

పడిపోయింది. సైనికులు దాన్ని గమనించుకోలేదు. తీరా పోయినాక తెరిచి చూస్తే ఇంకేముంది?! లోపల సగానికి సగం ఖాళీ అయిపోయింది.

దాంతో సైనికులు అదిరిపడి వెదుకుతా పోతే, దారి వెంబడి మొత్తం బంగారు వరహాలు కనబన్నాయి. దాంతో వాళ్ళు అటు వైపు నుంచి ఒక్కొక్కటి ఏరుకుంటా రాసాగినారు. ధనయ్యకు ఇది తెలీదు గదా, అందుకని వీడు ఇటువైపు నుంచి ఒక్కొక్కటి ఏరుకుంటా పోసాగినాడు. కొంతసేపు అయ్యేసరికి వాళ్ళు, వీడు ఒకరికొకరు ఎదురు పడినారు!

సైనికులు అదిరిపడి "ఏరా, దొంగ వెధవా! రాజుగారి వరహలే కాజేసి పోదామని అనుకుంటా వున్నావా?" అంటూ వాన్ని పట్టేసుకున్నారు.

వాడు నాకేమీ తెలీదంటూ లబోదిబోమని మొత్తుకోసాగినాడు. "మిగిలిన వరహాలు ఎక్కడున్నాయో చెప్పు!" అంటూ వాళ్ళు వాన్ని నున్నగా, తన్నిన చోట తన్నకుండా తన్నినారు. దాంతో వాడు వాళ్లకు జరిగిందంతా చెప్పేసినాడు.

సైనికులు కోపంగా "పోగొట్టుకుని పోయింది ఏదైనా దొరికితే దాన్ని రాజుకి అప్పజెప్పాల గానీ, ఇలా మట్టసంగా మూడో కంటికి తెలీకుండా నున్నగా నొక్కేయడమేనా. ఇంక నీకూ, ఆ దొంగలకూ తేడా ఏముంది? నీవల్ల రాజు సంపద అంతా దొంగల పాలు అయింది. మరియాదగా తిరిగి ఆ రెండు మూటల బంగారు ఖజానాకు కడతావా, లేక జీవితాంతం కారాగారంలో వేసి బంధించమంటావా?!" అన్నారు.

ఆ మాటలకు వాడు అదిరిపన్నాడు. కాళ్ళా వేళ్ళా పన్నాడు. అయినా వాళ్ళు వాన్ని వదలలేదు. దాంతో ఇంటికొచ్చి, ఎప్పుటినుంచో తినీ-తినక దాచి పెట్టుకున్న సొమ్మంతా తీసి వాళ్ళ చేతిలో పెట్టినాడు ధనయ్య. దాంతో ఆ సైనికులు అవన్నీ తీసుకోని వాన్ని వదిలేసినారు. "ఆశకు పోతే ఆఖరికి వున్నవి గూడా పోయినాయే!" అని ధనయ్య లబలబలాన్నాడు.




# మంచికి మంచి

రచన, చిత్రాలు : శ్రీ కె వి కృష్ణారావు గారు, కర్నూలు.

గిరి వాళ్ళ నాన్న వీరయ్య కష్టజీవి. వాళ్ళు పడే కష్టం తెలుసు గనకనే ఇంటి దగ్గర చాలా పనుల్లో తల్లిదండ్రులకు సాయం చేసేవాడు గిరి. బడిలో కూడా చదువుల్లోను, ఆటపాటల్లోను, ప్రవర్తనలో కూడాను 'మంచి పిల్లవాడు' అని పేరు తెచ్చుకున్నాడు.

అలా ఉండగా గిరి వాళ్ల అమ్మకి ఏదో పెద్ద జబ్బు చేసింది. వీరయ్య తన దగ్గరున్న కొద్దిపాటి డబ్బులతో స్థానికంగా ఆమెకు వైద్యం చేయించాడు కానీ ఆమె పరిస్థితి ఏమంత మెరుగు కాలేదు. మెరుగైన వైద్యం కావాలంటే పట్నం వెళ్ళాలి; దానికి డబ్బులు కావాలి.

ఆ సమయంలో ఇంక వేరే గతి లేని వీరయ్య ఊళ్ళో వడ్డీకి డబ్బులు ఇచ్చే గురవయ్య దగ్గరకు వెళ్ళి ఐదువేల రూపాయలు అప్పు అడిగాడు.

గురవయ్య అతనికి ఐదువేలూ ఇస్తూ

"వీరయ్యా! నా ఐదువేల అప్పూ వడ్డీతో సహా కట్టటం నీకు కష్టం అవుతుంది గాని, నా మాటవిని, నీ ఇల్లు నాకు అమ్మేయి. ఈ ఐదువేలు కూడా నేను ఇంటి ధరలో మినహాయించుకోను; అది నీకు అదనపు మేలు అవుతుంది!



ఇంతలా ఎందుకు అడుగుతున్నానంటే మరేమీ లేదు- నీ ఇల్లు నా పొలం ప్రక్కనే ఉన్నది కదా; అది ఉంటే నేను ఇంట్లో ఉండి పొలం చూసుకోవచ్చు" అన్నాడు అనునయంగా.

"అయ్యా! ఆ ఇల్లు మా తాతల నాటిది. నేను అందులోనే పెరిగి పెద్దయ్యాను. గిరి కూడా అక్కడే పుట్టాడు. ఆ ఇంటితో మాకు అనుబంధం ఎక్కువ. దయచేసి ఏమీ అనుకోవద్దు- కష్టపడి వడ్డీతో సహా మీ బాకీ రీరుస్తాను" అని నమ్రతతో చెప్పి డబ్బు తీసుకొని అప్పుపత్రం రాసిచ్చాడు వీరయ్య.

ఈ సంగతి తెల్సుకున్న గిరి కూడా, 'ఇంటి అప్పులు త్వరగా తీరాల'ని, 'అమ్మ త్వరగా కోలుకోవాల'ని అనుకొని, రోజూ బడి అయిపోయాక పని చేసేట్లు ఓ అంగడిలో పనికి కుదురుకున్నాడు. వీరయ్య వద్దంటున్నా వినకుండా ఇంటికోసం కష్టపడ-సాగాడు.

ఇంట్లో కూరగాయలు పండిస్తే, ఇక బయటినుండి కొనే ఖర్చు తగ్గుతుందని, ఇంటి పెరట్లో చిన్న చిన్న పాదులు చేసి, వంగ, బెండ, దొండ, దోస వంటి మొక్కలు, ఆకుకూరలు వేసి శ్రద్ధగా నీళ్ళు పోసి పెంచసాగాడు. మొక్కలు కూడా బాగా ఏపుగా పెరిగాయి.

ఇట్లా వీళ్ల ఇంట్లో అందరూ కలిసి కట్టుగా

పని చేయటాన్ని గమనించింది ఒక దేవత. వాళ్ళ మంచితనానికి, చిత్తశుద్ధికి ముచ్చటపడిన ఆ దేవి వాళ్లకు తగిన సాయం చేయాలనుకొని, ఒకరోజున పూలమొక్కలు అమ్మే స్త్రీ రూపంలో వీరయ్య ఇంటిముందుకు వచ్చి నిలబడింది.




గిరి ఆమెను పలకరించగానే ఆమె "బాబూ, మంచి కూరగాయల మొక్కలు వేసావు. దేవుడి కోసం కొన్ని పూల మొక్కలు కూడా వెయ్యి" అని ఓ పూలమొక్కను ఇచ్చింది వాడికి. గిరి సరేనంటూ దాన్ని తీసుకొని "ఎంతమ్మా?" అని ధర అడిగాడు.

"డబ్బులేమీ వద్దు నాయనా! మొక్క ఎదిగి పూశాక, దేవుడికి రోజూ ఐదు పూలు ఇవ్వు చాలు!" అంది పూలమ్మి.

గిరి ఆమెను తల్చుకుంటూ ఆ మొక్కని పెరడులో నాటాడు. పది రోజుల తర్వాత పూలమ్మి వచ్చి, మొక్కని చూసి మెచ్చుకొని, బాగా పెరుగుతున్నది నాయనా! "ఇట్లాగే దీని జతగా నాటు, ఈ మొక్కని కూడా" అంటూ మరో మొక్కని ఇచ్చి వెళ్ళింది.

గిరి ఆ మొక్కని నాటేందుకని త్రవ్వబోతే చిత్రంగా అక్కడ ఖంగుమని శబ్దం వచ్చింది! జాగ్రత్తగా చూస్తే అక్కడో కంచు చెంబు, అందులో నిండా బంగారు నాణాలు!

పరుగున వెళ్ళి తండ్రిని పిల్చుకొచ్చి చూపించాడు గిరి. "మనకు ఆ దేవుడే దారి చూపించాడు నాయనా! ఇందులోది ఒక్క నాణెం అమ్మామంటే చాలు, మనం గురవయ్య అప్పునూ తీర్చేయచ్చు, మీ అమ్మ ఆరోగ్యమూ బాగు చేయించుకోవచ్చు, నిన్ను బాగా చదివించుకోవచ్చు కూడా" అని రంగయ్య

కూడా చాలా సంతోషపడ్డాడు.

తీసుకున్న అప్పును వడ్డీతో సహా అంత త్వరగా తీర్చేసినందుకు గురవయ్య ఆశ్చర్యపోయి "వీరయ్యా! బాకీ తీర్చేసావే! ఎలా వచ్చింది, అంత డబ్బు?" అని అడిగాడు.

అమాయకపు వీరయ్య నిజం చెప్పేసాడు- "నిజంగా దేవుడే కరుణించాడు గురవయ్యా! మా పెరట్లో మొక్క పెట్టేందుకని పాదు త్రవ్వామా, ఇంత త్రవ్వగానే దొరికింది, ఓ చెంబు నిండా బంగారు దొరికింది; మా కష్టాలు తీరాయి!" అని.

"ఒక్క చెంబేనా, మరి దాని చుట్టూ ఇంకేమీ లేదుగా?!" అన్నాడు ఆశగా, గురవయ్య.

"ఏమో, చూడలేదు! నిజంగా మా జన్మకైతే ఇది చాలు గురవయ్యా! మావాడికి కూడా ఇంకేమీ అవసరం ఉండదు. ఆ తర్వాతి కథ తర్వాత ఎప్పుడైనా చూసుకోవచ్చు, కదా!" అన్నాడు వీరయ్య మరింత మురిసిపోతూ.

గురవయ్య లేని సంతోషం కనబరుస్తూ "అవునవును. మంచి వార్త చెప్పావు రంగయ్యా! ఇప్పుడు నీ భార్య కూడా కోలుకున్నది! దీనికంతా దేవుడే కారణం తప్ప మరేమీ కాదు. మీ కుటుంబం అంతా వీలు చూసుకొని ఓ నాలుగు రోజులు చుట్టు ప్రక్కల ఊళ్ళలో గుళ్లన్నీ దర్శించి రండి. అంతా మంచే జరుగుతుంది" అన్నాడు.

"మంచి ఆలోచన. ఎప్పుడో ఎందుకు, రేపే బయల్దేరి వెళ్తాం" అంటూ రంగయ్య ఇంటికి వెళ్ళి "ఇట్లా ముగ్గురం కలిసి ఓ నాలుగైదు రోజులు గుళ్లన్నీ దర్శించి వద్దామనిపిస్తున్నది. రేపు బయల్దేరుదామా?" అన్నాడు భార్యతో. భార్య సరేనన్నది; గిరి కూడా సరేననటంతో మరునాడే ముగ్గురూ బయలుదేరి వెళ్ళారు, క్షేత్రాలు తిరిగి వచ్చేందుకు.

అసలు గురవయ్య ఆలోచన ఏమంటే, 'ఒక్క చిన్న గుంత త్రవ్వితేనే గిరికి ఒక బంగారు చెంబు దొరికింది. నిజానికి అట్లాంటి చెంబులు ఇంకా ఎన్నో ఉండి ఉండచ్చు అక్కడ! పూర్తి స్థాయి నిధి కూడా ఉండచ్చు! ఏదో ఒక రకంగా వీళ్లను బయటికి పంపితే

తనే పెరడును త్రవ్వి చూసుకుంటాడు!'




వీరయ్యవాళ్ళు బయలుదేరిన రాత్రే, వాళ్ల పెరడులో ఖాళీ స్థలాన్నంతా అంగుళం వదలకుండా త్రవ్వి చూసాడు గురవయ్య. ఎంత త్రవ్వినా అతనికి ఏ చెంబూ దొరకలేదు! త్రవ్విన ప్రయాస మాత్రం మిగిలింది. అతని దురాశనంతా ఆకాశం నుండి దేవత చూసి నవ్వుకున్నది.

నాలుగు రోజుల తర్వాత తిరిగి వచ్చిన వీరయ్య కుటుంబం తమ ఇంటి పెరడంతా త్రవ్వి ఉండటం చూసి ఆశ్చర్యపోయారు. ఇరుగు పొరుగు వాళ్ళెవరూ దాన్ని గురించి ఏమీ చెప్పలేకపోయారు. "ఇదంతా దేవుని లీల! మనం మరిన్ని కూరగాయలు, పూల మొక్కలు పెట్టాలని, ఆ దేవుడు ఇలా త్రవ్వించి పెట్టాడు" అని రంగయ్య, గిరి పెరడంతా కూరగాయలు, పూల మొక్కలు నాటారు. దేవత కూడా వచ్చి ఆశీర్వదించి వెళ్ళింది.

అటుపైన వీరయ్య కుటుంబం ఏ పని తలపెట్టినా అది తప్పకుండా మంచి ఫలితం ఇవ్వసాగింది. వాళ్ల ఇల్లు కూడా పచ్చగా కళకళలాడింది. దీన్ని గమనించిన గురవయ్యలో అంతర్మథనం మొదలైంది. "మంచి చేస్తే మంచి, చెడు చేస్తే చెడు జరుగుతాయి" అని అర్థం చేసుకున్న గురవయ్య క్రమంగా మంచి పనులు చేయటం మొదలెట్టాడు. కష్టాల్లో ఉన్నవారికి తన చేతనైనంత సాయం చేయసాగాడు. గతంలోలాగా అధిక వడ్డీలు వసూలు చేయటం మానుకున్నాడు. అతనిలో మార్పును గమనించిన ఊళ్ళో వాళ్ళు అతన్నీ సమధికంగా గౌరవించారు.

## Form IV

*Statement about ownership and other particulars about newspaper* **Kottapalli** :

1. Place pf publication: Kottapalli Prachuranalu,
   1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
2. Periodicity of publication: Monthly
3. Printer's Name : Narayana Sarma G.V.
   Nationality: Indian
   Address: 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
4. Publisher's Name: Narayana Sarma G.V.
   Nationality: Indian
   Address: 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
5. Editor's Name: Narayana Sarma G.V.
   Nationality: Indian
   Address: 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuramu District, A.P. - 515101
6. The Names and Addresses of individuals who own the newspaper and partners or shareholders holding More than one percent of the total capital:
   Dr. Samatha Potu, President, Satya- Foundation For A Healthy Society, 'Sri Krupa', Near Bus Stand, Chennoor, Adilabad District, Telangana State- 504201

**I, Narayana Sarma G.V. hereby declaere that the particulars given above are true to the best of my knowledge and belief.**

**Date:** 15-04-2019

**Signature Of the publisher:** Narayana

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 15/04/2019 Postal Regn No: HDP/008/2018-2020

## మార్కులా, కథలా?

సుబ్బారావు వచ్చాడు "ఇదిగో, ప్రపంచమంతా 'ర్యాంకులు కావాలి, మార్కులు కావాలి' అని తన్నుకులాడుతుంటే, మీరు ఇట్లా 'కథలు, జోకులు, పాటలు' అని పంతం పట్టుకొని కూర్చోటం బాలేదు" అంటూ.

నేను నవ్వాను. "గుర్తుపట్టావే, మొత్తానికి?!" అన్నాను.

"ఆ మాత్రం తెలుస్తూనే ఉందిలే. అయినా మీ కొత్తపల్లి వాళ్లకి చదువులు కావాలా-అక్కర్లేదా, ముందు ఆ సంగతి తేల్చు, ఇవాళ్ల" అన్నాడు సుబ్బారావు కూర్చుంటూ.

"చూడు సుబ్బారావూ, అర్థం చేసుకో: కథల్లో మనసుకి హాయినిచ్చే గుణం ఉంటుంది. అవి పిల్లల్ని నవ్విస్తాయి; వాళ్లని మెచ్చుకుంటాయి; వాళ్లకు రకరకాల సంగతులు నేర్పిస్తాయి; ఎట్లా ఉంటే మంచిదో చెబుతాయి; జీవితం పట్ల ఆశనీ, భవిష్యత్తు పట్ల ఉత్సాహాన్నీ కలిగిస్తాయి. అట్లాంటివి చదవకపోతే, పిల్లలు తొందరగా ముసలివాళ్ళు అయిపోతారు. నవ్వటం, సంతోషపడటం మరచిపోతారు. నిరాశావాదులు అయిపోతారు. అది ఏం మేలు, చెప్పు?" అన్నాను అనునయంగా.

"అవునులే, రోజంతా పనిచేసాక ఓ కథ చదివితే నాకు కూడా ప్రాణం లేచివచ్చినట్లనిపిస్తుంది. అయినా చదువుకోవాల్సిన పిల్లలు వీటిలో పడితే వాళ్లకి టైం వేస్టు కాదూ?"

"ఇరవై నాలుగు గంటలూ పని చేస్తే ఇంజన్లు వేడెక్కిపోతాయిరా బాబూ! మెదడుల పనితీరుని అర్థం చేసుకోవాలి; వాటికి సేదతీరే సమయం దొరికేట్లు చేయాలి. రిలాక్స్ అయిన మెదళ్లే కదా అద్భుతాలు సృష్టించేది?! ఆట పాటలు, కళలు, సాహిత్యం- ఇవన్నీ మనసుని చల్లబరుస్తాయి. క్రొత్త ఊపిరి పోసి, అంతరంగాల్ని ప్రాణశక్తితో నింపుతాయి"

“నువ్వు ఏదేదో చెబుతావు- అంతేలే" అన్నాడు సుబ్బారావు నిస్సహాయంగా.

"ఇదిగో, నువ్వు నసుగుతూనే ఉంటావుగానీ.. ఇదొక్కటీ చెప్పు- మీవాడి ముఖం కొత్తపల్లిని చూడగానే వెలుగుతుందా, లేదా?" చివరి అస్త్రం ప్రయోగించాను నేను.

కొడుకు ముఖం గుర్తుకొచ్చిన సుబ్బారావు సంతోషంగా నవ్వాడు.

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.